# చిట్టీ ఎంపిక







చిట్టీని తల్లి రోజూ మామూలు సబ్బుతో స్నానం చేయిస్తుంది. చిట్టి కోపంతో ఏడ్చేవాడు.









దుకాణంలో ఉన్న, మార్కెట్లో లభించే సబ్బులన్నిటినీ చూశాడు.



మైసూర్ శాండల్ సంస్థ గత 80 సంవత్సరాలకు పైగా చందనం శ్రేష్ఠతను మీ ఇళ్ళల్లోకి తీసుకువస్తోంది.
























Heroes start early.

Ride, race, take a tumble or even take a fall.

Because it's never too early to be a hero.



## విజయనగర సామ్రాజ్య వైభవచిహ్నం

# చంద్రగిరి కోట!

దక్షిణ భారతదేశంలోని తెలుగు, కన్నడ భాషా ప్రాంతాలలో ఎక్కువ భాగం విస్తరించి, మూడు శతాబ్దాల పాటు వెలుగొందిన విజయనగర సామ్రాజ్యం మనదేశ చరిత్రలో వైభవోపేతయుగంగా ప్రసిద్ధిగాంచింది.

రాయల వంశానికి చెందిన విజయ నగర రాజులను ప్రజలు ఆదరాభి మానాలతో 'రాయలవారు' అని పిలిచేవారు. రాజ్యాన్ని సుభిక్షంగా పాలించడంతోపాటు, విజయనగర రాజులు కళలను పోషించారు. కవులను ఆదరించారు. కావ్యరచనలతో ఆంధ్రసాహిత్యం సుసంపన్నం కావ డానికి దోహదం చేశారు!




విజయనగర రాజుల కడపటి రాజధాని అయిన చంద్రగిరి తిరుపతికి పన్నెండు కి.మీ. పడమరగా స్వర్ణముఖీనదీ తీరంలో ఉన్నది. ఇక్కడ ఇప్పుడు విజయనగరసామ్రాజ్య ఉన్నతి–పతనాలను వివరించే అద్భుతమైన 'రూపవాణి' కార్యక్రమాన్ని ఏర్పాటుచేశారు.

సాహసోపేత గాథలతో నిండిన దక్షిణభారత చరిత్ర పట్ల ఆసక్తిగలవారందరూ ఈ రూపవాణి కార్యక్రమాన్ని తప్పక తిలకించాలి. ఆంగ్లంలో ప్రముఖనటుడు అమితాబచ్చన్ కంఠస్వరంతోనూ, తెలుగులో మరొక గంభీర కంఠస్వరంతోనూ ఇది రూపొందించబడింది. ఆంధ్రప్రదేశ్ పర్యాటకాభివృద్ధి సంస్థ నిర్వహిస్తున్న వినోద–విద్యా ప్రధానమైన ఈ కార్యక్రమం – పిల్లలూ, పెద్దలూ అందరూ సకుటుంబ సమేతంగా చూడతగినది!

రాయల వంశస్థులు పరిపాలించడంవల్లే మన రాష్ట్రంలోని దక్షిణభాగాన్ని రాయలసీమ అని అంటారు. రాయలేలిన ఈ భూమిని రతనాలసీమ అని కూడా చెప్పేవారు. విజయనగర సామ్రాజ్య పాలకులలో ఆంధ్రభోజుడుగా కీర్తిగాంచిన శ్రీకృష్ణదేవరాయలు సుప్రసిద్ధుడు.

దక్కను పీఠభూమిలో మహమ్మద్-బిన్-తుగ్లక్ పట్టు సడలుతున్న కాల ఘట్టంలో విజయనగర సామ్రాజ్య ఆవిర్భావం జరిగింది. దీనిని సాళువ, అర్వీటి, తుళువ అనే మూడు వంశాలవారు పాలించారు. వారిలో తుళువ వంశస్థులు కడుపటివారు. కృష్ణా, తుంగభద్రానదుల మధ్యప్రాంతాన్ని పాలించడానికి సింహాసనం అధిష్ఠించిన శ్రీకృష్ణదేవరాయలు తూర్పు ఒరిస్సాతోపాటు, దక్షిణ ప్రాంతాలనుకూడా జయించి రాజ్యాన్ని విస్తరింపజేశాడు!

చంద్రగిరి కోట ఇప్పుడు దాదాపు శిథిలావస్థలో ఉన్నది. అయినా, అందులోని రాణిమహల్, రాజమహల్ బాగుచేయబడి, పర్యాటకాభివృద్ధిసంస్థద్వారా దీపాలంకరణ చేయబడి ఉన్నవి. కోట లోపల కొన్ని దేవాలయాలు కూడా ఉన్నాయి.

ఇక్కడ ఆసక్తికరమైన చారిత్రక విశేషం ఒకటి ఉన్నది. చంద్రగిరిని పరిపాలించిన చివరి విజయనగర రాజు తూర్పు సముద్రతీరంలోని కొంత భూభాగాన్ని బ్రిటిష్‌వారికి కానుకగా ఇస్తూ ఒప్పందం మీద సంతకం చేశాడు. ఆ భూభాగం చెన్నపట్టణంగా, మద్రాసు నగరంగా అభివృద్ధిచెంది ఈనాడు చెన్నయ్ మహానగరంగా వెలుగొందుతున్నది. చంద్రగిరి రాజుల నుంచి పొందిన స్థలంలోనే బ్రిటిష్‌వాళ్ళు సెయింట్ జార్జ్ కోటను నిర్మించారు. భారతదేశంలో స్థిరపడి ఈస్ట్ ఇండియా కంపెనీద్వారా బ్రిటిష్ పాలన ఏర్పడడానికి ఇదే దారితీసింది.

## విజయనగర ఉత్సవం

(అక్టోబర్ మూడవ శుక్ర,శని, ఆదివారాలు)

తిరుపతి సమీపంలోని చారిత్రాత్మకమైన చంద్రగిరి కోట (రూపవాణి కార్యక్రమం జరుగుతున్న ప్రదేశం) విజయనగర రాజుల వైభవ చిహ్నంగా ఈనాటికీ వెలుగొందుతున్నది. ఇక్కడ యేటా విజయనగర ఉత్సవం జరుపుతున్నారు. తిరుమలలో బ్రహ్మోత్సవాలు జరిగే సమయంలోనే ఈ విజయనగర ఉత్సవం ఏర్పాటు చేయడం విశేషం. ఈ ఉత్సవ సందర్భంగా సుప్రసిద్ధ కళాకారుల గాన కచేరీలు, నృత్యప్రదర్శనలు, గత వైభవాన్ని మన మనోనేత్రాల ముందు కదలాడేలాచేస్తాయి!

**వివరాలకు సంప్రదించండి: తిరుపతి**: సెంట్రల్ రిజర్వేషన్ కార్యాలయాలు,టి.పి. ఏరియా, వేంకటేశ్వరా బస్ స్టేషన్‌పక్కన ఫోన్:08574-55385 55386 మొబైల్ 98480-07083 ఫ్యాక్స్:08574-56877 **తిరుమల**:08574-70055 **నెల్లూరు**: ఇం.నం.241/1613, ఫస్ట్‌ఫ్లోర్, కస్తూరిబాయ్ కళాక్షేత్రం ఎదురుగుండా, పోలీస్ ఆఫీస్ రోడ్, దర్గామిట్ట ఫోన్:0861-306089 **హైదరాబాద్**: బి ఆర్ కె ఆర్ భవన్ ఎదుగుండా, ట్యాంక్‌బండ్ రోడ్ ఫోన్: 040-345 3036, 3450165,ఫ్యాక్స్ 040-345 3086. **సికిందరాబాద్**: యాత్రీనివాస్ కాంప్లెక్స్, ఎస్.పి.రోడ్ ఫోన్: 040-7893100, 7816375; **విజయవాడ**: హోటల్ ఇలాపురం కాంప్లెక్స్, గాంధీనగర్ ఫోన్:0866-570 255, 523966 **విశాఖపట్నం**: ఎల్.ఐ.సి బిల్డింగ్, డాబా గార్డెన్ ఫోన్ 0891-746446, ఫ్యాక్స్:713136, **కర్నూలు**: ఎ పి టి డి సి డివిజనల్ ఆఫీస్, సి.డి.6, సి-క్యాంప్ నంద్యాల రోడ్, టెలిఫ్యాక్స్: 08518-70104, **నాగార్జున సాగర్**: 08680-77364 76540 **శ్రీశైలం**: 08524-88311, **వరంగల్**:08712-459201 446606




ANDHRA PRADESH TOURISM DEVELOPMENT CORPORATION

ఆం.ప్ర. పర్యాటక సంస్థ

24 గంటల సమాచారంకోసం:

హైదరాబాద్/సికింద్రాబాద్:

1901-334033

భారతదేశంలో ఇతర ప్రాంతాలనుంచి:

0901-334033



సత్యాన్వేషి (బే.క) 19



దేవుడితో జూదం! 24



మాయాసరోవరం 11



ఇంటిదొంగ 59





## ఈ సంచికలో





కలలు కంటూన్న కొంగ! (పేజీ ...36)

**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ. **120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి'.



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# హింసకు చోటు లేదు!

పదవీ విరమణ సందర్భంగా మాజీ రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్ దేశప్రజలనుద్దేశించి ప్రసంగిస్తూ, మతసహనాన్ని పరిరక్షించుకోవాలని పిలుపునిచ్చారు. మరునాడు నూతన రాష్ట్రపతి డాక్టర్. ఎ.పి.జె. అబ్దుల్ కలామ్ మనం కలలుగనే సర్వతోముఖాభివృద్ధిగాంచిన సముజ్వల భారతదేశ నిర్మాణం - నిరంతర కృషితోపాటు లౌకికవాద నిబద్ధతతోనే సాధ్యం, అనే సందేశాన్ని అందించారు.

ఇద్దరూ ఈ విషయాన్ని ప్రస్తావించడానికి కారణం - మనదేశంలోని కొన్ని ప్రాంతాలలో ఇటీవల చెలరేగిన మతకలహాలే అన్నది తేటతెల్లం. ఏ మతంగాని హింసను బోధించడం లేదు. అయితే, అధికార దాహంతో కొందరు మతోన్మాదులు స్వార్థప్రయోజనాలకోసం మతం పేరుతో అమాయక ప్రజలమీద హింసను రెచ్చగొడుతున్నారు. ఇటీవల ఒకముప్పై కుటుంబాల కార్మికుల కాలనీ మీద జరిగిన ఊచకోత దేశాన్ని దిగ్భ్రాంతిలో ముంచెత్తింది.

ఆ రోజే అదే మతానికి చెందిన ఇద్దరు క్రీడాకారులు, ఇంగ్లాండులో జరిగిన క్రికెట్ పోటీలో మాతృదేశానికి విజయం సాధించిపెట్టారు. మనజట్టు ఓడిపోయే దశలో మహమ్మద్‌కైఫ్, జహీర్‌ఖాన్ అనే క్రీడాకారులు, ఎంతో నేర్పుతో ఆడి మాతృదేశ గౌరవం నిలబెట్టారు. విజయం సాధించాలనే పట్టుదలతో ఆడారే తప్ప, వాళ్ళు ఆ సమయంలో తాము ఏ మతానికి చెందినవారమని ఆలోచించలేదు!

ఈ నేపథ్యంలో చూస్తే ఇద్దరు రాష్ట్రపతుల ఒకేవిధమైన ఆలోచనలకు కారణం అర్థమవుతుంది.

మనదేశంలో హింసకు చోటివ్వకూడదు. ఎదుటివారి క్షేమం, అందరి శాంతీ, సౌఖ్యం ధ్యేయంగానే ప్రతి ఒక్కరూ ఆలోచించాలి. అప్పుడే పెద్దలు కాంక్షించిన అభ్యుదయం సాధ్యమవుతుంది!

---

సంపాదకుడు : విశ్వం





## హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 12

మన జాతీయోద్యమ నాయకులు కొందరినిగురించి ఇక్కడ ప్రస్తావించాం. వాళ్ళు మీకు తెలుసా? ప్రయత్నించి చూడండి.

**అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!★**

1. బ్రిటిష్ ప్రభుత్వ ఉద్యోగాలను వదిలివేయమని కాంగ్రెస్‌వారికి పిలుపునిచ్చాను. నన్ను 'పంజాబు పులి' అనేవారు. నేనెవరో తెలుసా?

---

2. నేనొక తమిళ విప్లవ కవిని. దేశభక్తిని ప్రబోధిస్తూ, భారతమాతనూ, శక్తినీ కీర్తిస్తూ చాలా గీతాలు రచించాను. నా పేరేమిటో తెలుసా?

---

3. మరాఠీ దినపత్రిక 'కేసరి' కి సంపాదకుణ్ణి. బ్రిటిష్ ప్రభుత్వం ఆరేళ్ళపాటు నాకు బర్మాలోని మండాలేలో ప్రవాసశిక్ష విధించింది.

---

4. నేను హిందూస్థాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ ఆర్మీ ప్రారంభించాను. నా సహచరులు రాజ్‌గురు, సుఖదేవ్‌లతోపాటు నేను 1931లో ఉరితీయబడ్డాను. నేనెవరిని?

---

5. నేను సత్యాగ్రహాన్ని ఒక రాజకీయ ఆయుధంగా ఉపయోగించాను. అది బాగా పని చేసింది కదూ? నా పేరేమిటి?

---



ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన స్వాతంత్ర్యోద్యమ వీరుడు ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

**నా అభిమాన జాతీయోద్యమ వీరుడు:**

.............................................................

.............................................................

పాల్గొనేవారి పేరు: ....................................................

వయసు:............ తరగతి: ..............................................

చిరునామా: ..........................................................

.............................................................

పిన్: ...................... ఫోన్: ......................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం: ......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 అక్టోబర్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-12
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ
ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.

__సూచనలు:__

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్టయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు






# అభినందనలు!

మాంచెస్టర్‌లో జరిగిన పదిహేడో కామన్వెల్త్ క్రీడలలో భారత క్రీడాకారులు మొత్తం 72 పతకాలను సాధించారు. మనదేశానికి మూడవ స్థానం లభించింది. 72 పతకాలలో 32 స్వర్ణ పతకాలు. వీటిలో వెయిట్ లిఫ్టింగ్, షూటింగ్‌లకే 27 పతకాలు లభించాయి. భారత మహిళా వెయిట్ లిఫ్టర్లు విశేషమైన ప్రతిభా పాటవాలను కనబరిచి 13 స్వర్ణపతకాలను సాధించారు. 47 కేజీల విభాగంలో ఎన్. కుంజరాణి, 53 కేజీల విభాగంలో సనామాచా ఛాను, 75 కేజీల విభాగంలో పూజారి శైలజలు మూడేసి స్వర్ణపతకాలు సాధించారు. షూటింగ్‌లో జస్పాల్ రాణా, అంజలీ భగవత్‌లు చెరో నాలుగు బంగారు పతకాలూ, అభినవ్ బింద్రా ఒక బంగారు పతకాన్నీ గెలుపొందారు. బాక్సింగ్‌లో మహ్మద్ అలీ కమర్ తొలి సారిగా భారత్‌కు స్వర్ణపతకం సాధించిపెట్టాడు.

స్వర్ణపతకాలు సాధించడంలో పురుషుల కన్నా మన స్త్రీలు ముందంజలో ఉండడం చెప్పుకోతగ్గ విశేషం. ముఖ్యంగా భారత్ మహిళా హాకీజట్టు బంగారు పతకాన్ని సాధించడం ఆనందకరమైన విషయం. ఆంధ్రరాష్ట్రానికి చెందిన పూజారి శైలజ మూడు స్వర్ణపతకాలనూ, నీలంశెట్టి లక్ష్మి మూడు రజత పతకాలనూ సాధించడం మనమెంతో గర్వించతగ్గ విషయం. వీరందరినీ **చందమామ** హృదయపూర్వకంగా అభినందిస్తూ, మునుముందు ఈ స్ఫూర్తితో మరిన్ని ఘనవిజయాలను సాధించి మన త్రివర్ణపతాకాన్ని అంతర్జాతీయ క్రీడారంగంలో దేదీప్యమానంగా ఎగురవేయాలని ఆశిస్తున్నది.

సుప్రసిద్ధంకాని సుందరప్రదేశాలు

# టైడాలో 'అడవిగంటలు'



విశాఖపట్నానికి 75 కి.మీ. దూరంలో తూర్పుకనుమల మధ్య ఉన్న చిన్నగ్రామం టైడా. ఈ సుందర ప్రాంతంలో అడవిగంటలు (జంగిల్ బెల్స్) అనే ప్రకృతి శిబిరాన్ని ఏర్పరచి అభివృద్ధిచేయడానికి ఆంధ్రప్రదేశ్ పర్యాటకాభివృద్ధి సంస్థ, రాష్ట్ర అటవీశాఖ సంయుక్తంగా కృషిచేస్తున్నాయి. రాష్ట్రంలోని జీవావరణ- పర్యాటక-పర్యావరణ-విద్యావికాస పథకాలలో ఇదే మొదటిది!

ఈ జంగిల్ బెల్స్ ప్రకృతిశిబిరం 25 ఎకరాల అటవీ ప్రాంతంలో విస్తరించి ఉంది. మనం ఇక్కడ గుడారాలు, గుడిసెలు, కుటీరాలు, పడకటిండ్లు మొదలైనవాటిని ఏర్పాటుచేసుకోవచ్చు. ఇక్కడ రెస్టారెంట్లు, కాఫీ కొట్లు, ప్రకృతి గ్రంథాలయం, వాచ్ టవర్లు, నార ఉయ్యాల ల్లాంటి ఆధునిక సౌకర్యాలు కూడా ఉన్నాయి!



దాపులనున్న అడవులు, పల్లెలు మొదలైనవాటి దగ్గరికి వెళ్ళడానికీ, వివిధజాతుల పక్షులను గుర్తించడానికీ ఇక్కడ శిక్షణ పొందిన 'గైడ్'ల సాయం పొందవచ్చు. పక్షుల అభిమానులకు టైడా ప్రకృతి ప్రసాదించిన ఒక వరంలాంటిది. ఈ చుట్టుపక్కల దాదాపు 350 జాతుల పక్షులు ఉన్నాయి. మీరు అడవిలోని వింతలనూ, విశేషాలనూ, జంతువుల పక్షుల తీరుతెన్నులనూ తెలుసుకోవాలంటే వాటిని వివరించి చెప్పడానికి తగిన ఉపాధ్యాయులు ఉన్నారు. జంతువుల అడుగు జాడలు ఎలా కనిపెట్టాలి? వివిధ జంతువుల, పక్షుల అరుపులూ, కూతలూ ఫలానా అని ఎలా పోల్చు కోవాలి? ఏ ఏ జంతువులు ఎక్కడెక్కడ దాగి ఉంటాయో గ్రహించడం ఎలాగా? హఠాత్తుగా పులి ఎదురు పడితే ఏం చేయాలి? మొదలైన విషయాలను ఈ ఉపాధ్యాయులు విశదీకరిస్తారు. ఈ సుందర ప్రాంతానికి మరింత శోభను సమకూర్చేవిధంగా ఇక్కడ మచ్చల జింకలు, అరిచే లేళ్ళు, ఎలుగుబంట్లు, చిరుతపులులు, అడవిపందులు ఉన్నాయి.

అలా అడవిలో వెళుతూ ఉంటే అతి సమీపంలో కొండలూ, గుట్టలూ రా రమ్మని పిలుస్తున్నట్టు కనిపిస్తాయి. ఉత్సాహం గనక ఉంటే, హాయిగా కొండలెక్కి ఆనందానుభూతిని తనివి తీర పొందవచ్చు!

<u>ఇక్కడికి చేరుకోవడం ఎలాగా?</u> విశాఖపట్నం నుంచి కారు ఏర్పాటుచేసుకోవచ్చు. అయినా, రైలులో వెళ్ళడమే ఉత్తమం. ఎందుకంటే దారిపొడవునా మనోహరమైన పచ్చటి ప్రదేశాలు, కొండలు, కోనలు, లోయలు, జలపాతాలు, సొరంగాలు అంటూ కన్నుల పండువ చేస్తాయి. ఆంధ్రప్రదేశ్ పర్యాటకాభివృద్ధి సంస్థ ప్యాకేజ్ ట్యూర్ హైటెక్ కోచ్‌లో కూడా వెళ్ళవచ్చు!



# మాయాసరోవరం

## 8

[జలపాతం నుంచి ప్రాణాలతో బయటపడిన జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఒక మరుగుజ్జువాణ్ణి, ప్రాణులను పట్టి తినే చెట్టునుంచి కాపాడారు. ఆ సమయంలో అక్కడికి పొట్టేళ్ళరథం మీద మరుగుజ్జుజాతివాళ్ళ రాణి వచ్చింది. ఆమె తన శత్రువులను గురించి చెపుతున్నంతలో, కొండగుట్ట మీది నుంచి ఒక భయంకర జంతువు, వాళ్ళకేసి ఒక బండరాయిని విసిరింది. - తరవాత]

జయశీలుడూ, సిద్ధసాధకుడూ కొండ గుట్ట మీద వున్న భయంకర జంతువునుగాక, దాని పక్కన నిలబడివున్న మనిషికేసి ఆశ్చర్యపోతూ చూడసాగారు. జయశీలుణ్ణి ఆ మనిషిని తానెక్కడో చూశానన్న అనుమానం బాధించ సాగింది. అంతలో భయంకర జంతువు విసిరిన బండరాయి, వాళ్ళు నిలబడివున్న చోటుకు కొద్దిదూరంలో దభీమంటూ నేలమీద పడింది.

పొట్టేళ్ళ వాహనాలమీద వున్న మరుగుజ్జు వాళ్ళంతా భయకంపితులైపోయారు. మరుగుజ్జురాణి, జయశీల సిద్ధసాధకులతో, "మహాకాయుల్లారా! ఆ భయంకర నరవానరం, దానిని మచ్చికచేసిన మహాకాయుడూ పది పన్నెండు రోజులుగా మమ్మల్ని నానా హింసా పెడుతున్నారు. ఏ క్షణాన అయినా, మాకన్న తక్కువ జాతివాళ్ళయిన మరుగుజ్జులు, అతడి ఆసరాతో మా మీద దాడి చేయవచ్చు!" అన్నది.

జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ గడెకారి రాణిమీద చాలా జాలి కలిగింది. ఆవిడా, ఆవిడ వెంటవున్న మరుగుజ్జువాళ్ళూ ధైర్య



వంతులనీ, సాహసికులనీ తెలుస్తూనే వున్నది; కాని వాళ్ళు నరవానరాన్నీ, దాని వెంటవున్న మనిషినీ చూసి భయభ్రాంతులవుతున్నారు.

ఇంతలో నరవానరం పక్కన వున్నవాడు, కత్తి పిడితో వానరాన్ని పొడిచి, ఏదో ఆజ్ఞ ఇచ్చాడు. నరవానరం గెంతుతూ పోయి దాపులనున్న ఒక బండరాయిని పైకెత్తేందుకు ప్రయత్నిస్తున్నది.

''సాధకా, వాడు మళ్ళీ మనకేసి బండ రాయిని నరవానరంచేత విసిరించాలని చూస్తు న్నట్టున్నది. పట్టపగలు అంత పెద్దరాయి దెబ్బ నుంచి తప్పుకోవడం చాలా సులువని, ఆ బుద్ధి హీనుడికి తెలిసినట్టులేదు,'' అని జయశీలుడు, గడెకారి రాణితో, ''మీ వాళ్ళు అరణ్యంలో వేటా డేందుకు ఉపయోగించే విల్లంబు ఒకటి వెంటనే తెప్పించు,'' అన్నాడు.

జయశీలుడు విల్లంబుల సంగతి తేగానే, మరుగుజ్జుసేనాని భయంగా ఒకసారి రాణికేసి చూసి, ఏదో చెప్పబోయి గొంతు పెగలక వూరు కున్నాడు. అది గమనించిన సిద్ధసాధకుడు, ''ఏమోయ్, మరుగుజ్జు యోధుడా! మాట్లా డేందుకే భయపడే నువ్వు, ఇక యుద్ధంలో సైనికుల్నీ, పొట్టేలు రౌతుల్నీ ఎలా నడిపించ గలవు?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు మరుగుజ్జు సేనాని వెలవెల పోతూ రాణితో, ''మహారాణీ! మనజాతివాళ్ళు విల్లంబులు అంటరాదన్న కట్టుడి వున్నది. కానీ, నేను అరణ్యంలో దొరికిన విల్లంబులను, నా ఇంట దాచి వుంచాను,'' అన్నాడు.

మరుగుజ్జురాణి ఆ మాటలు వింటూనే రౌద్రంగా ఏమో అనబోయేంతలో జయ శీలుడు చేఎత్తి ఆమెను శాంతపరుస్తూ, ''రాణీ, ఆ విల్లంబులను తక్షణం తెప్పించా వంటే, ప్రస్తుతానికి ఆ నరవానరం పీడ వది లిస్తాను. తర్వాత నేనే, నా విల్లంబు తయారు చేసుకుని, ఆ మనిషినీ, నరవానరాన్నీ ఎలా హతమార్చాలో పథకం వేయగలను,''అన్నాడు.

రాణి, తన సేనానాయకుడికేసి చూసింది. సేనాని తన వాహనాన్ని అదిలించి, వేగంగా చెట్ల వెనక వున్న తన ఇంటికేసి వెళ్ళాడు.

ఈ లోపల నరవానరం మరొక బండ రాయిని ఎత్తిపట్టుకున్నది. దాని నడుముకు కట్టిన ఇనుపగొలుసును పట్టుకున్నవాడు, పెద్ద గొంతుతో అరిచి, కత్తిపిడితో దాని వీపు మీద కొట్టాడు. వానరం గిరుక్కున పక్కకు తిరిగి బండరాయిని వాడిమీదికి విసరబో యింది. వాడు కత్తిమొనను వానరం గొంతుకు ఆనించి, బిగ్గరగా కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే జయశీలుడు చిన్నగా ఈలవేసి, ''సిద్ధసాధకా! ఆ మనిషి ఎవడో

ఇప్పుడు నాకు తెలిసిపోయింది. వాడు మీ హిరణ్యపురంవాడు కాదు, మా అమరావతీ నగరంవాడు. నేను పుట్టి పెరిగిన నగరం వదిలి, దేశాలు పట్టుకుని మీ హిరణ్యపురం చేరడానికీ, అక్కడినుంచి ఇలా అరణ్యాల వెంట తిరగడానికీ - వాడే కారకుడు. వాడొక ప్పుడు మా రాజు రుద్రసేనుడి దగ్గర అశ్వదళ నాయకుడు; పేరు కృపాణజిత్తు!'' అన్నాడు.

అంతలో మరుగుజ్జు సేనాని విల్లంబులు తెచ్చి, వాటిని జయశీలుడి పాదాల ముందు పెట్టాడు. జయశీలుడు విల్లును పరీక్షించి చూశాడు. అది చాలా దృఢంగా వున్నది. దానితోపాటు ఆరు వాడిగల బాణాలు!

సిద్ధసాధకుడు విల్లంబులకేసి ఒకసారి తృప్తిగా చూసి, ''జయశీలా! ఆ కృపాణ జిత్తునూ, నరవానరాన్నీ అస్త్రం దెబ్బలతో పర లోకానికి పంపబోతున్నావా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు జయశీలుడు నవ్వి, ''సాధకా! ఇంత దూరాన్నుంచి ఆ ఇద్దర్నీ బాణంతో గురిగా కొట్టడం అంత తేలిక అనుకుంటు న్నావా? ఇవి మామూలు బాణాలు. బ్రహ్మా స్త్రాలో, నాగాస్త్రాలో కాదు!'' అన్నాడు.

ఇది విన్న మరుగుజ్జురాణి, నీ అభి ప్రాయం ఏమిటన్నట్టు తన సేనానికేసి చూసింది. సేనాని తన పొట్టేలు వాహనం మీద ధీమాగా బల్లెం ఎత్తి పట్టుకుని జయశీలు డితో, ''అయ్యా, మీరు ఆ దుర్మార్గులకేసి బాణం కొట్టండి, చాలు! ఇంతవరకూ మా శత్రువులు బల్లెంపోటు ఎలాంటిదో తప్ప, బాణం దెబ్బ ఎరగరు. మీ బాణం పోయి తగల గానే వాళ్ళు భయకంపితులైపోతారు. ఆ సమ యంలో మేము వాళ్ళపై దాడిచేసి, వాళ్ళను



ఆ కొండగుట్ట దిగువకు తరిమికొడతాం. సాధ్య మైతే వాళ్ళుండే గూడెంమీద పడి, దానికి నిప్పు పెడతాం,'' అన్నాడు.

ఆ వెంటనే సిద్ధసాధకుడు శూలం ఎత్తి, ''జయశీలా! ఇదే మంచి సమయం. గురి చూసి బాణం వదులు. నరవానరం కట్టు గొలు సులు తెంచుకుని, ఒక మరుగుజ్జువాణ్ణి పట్టుకోవాలని చూస్తున్నది,'' అన్నాడు.

జయశీలుడు బాణం ఎక్కుపెట్టి నరవాన రంకేసి వదిలాడు. బాణం రివ్వుమంటూ పోయి వానరం నడుముకు తగిలింది. మరు క్షణం అది భీకరంగా అరిచి, తన చేతికి దొరికిన మరుగుజ్జువాణ్ణి కొండగుట్ట కిందికి విసిరి వేసింది. మరుగుజ్జువాడు చావు భయంతో కీచుమంటూ గాలిలో కొట్టుకుని వస్తూండగా, మరుగుజ్జు సేనానాయకుడు, అనుచరులను హెచ్చరించాడు. గొర్రెపొటేలు రౌతులూ,



ఆ వెంటనే జయశీలుడూ, సిద్ధసాధకుడూ వేగంగా గుట్టమీదికి పోయి, మరుగుజ్జు సేనానితో, "సేనానీ, నీ భటుల్ని కొంచెం ఆగమను. వానరం తిరిగి మీమీదికి రాళ్ళు విసిరే ప్రమాదం వున్నది," అన్నాడు.

అందుకు మరుగుజ్జుసేనాని, "మీరు ఆ భయంకర జంతువు నుంచీ, వెంటవున్న మహాకాయుణ్ణుంచీ మాకు హాని కలక్కుండా చూడండి. మేము గడెకొండ దుర్మార్గుణ్ణీ, వాడి అనుచరులనూ బళ్ళాలకు గుచ్చి, గుట్ట కిందికి విసిరివేస్తాం," అన్నాడు.

"ఆహా, నీ మాటపలుకు, నీ చేతి బళ్ళెం మొన అంత వాడిగానే వున్నది. కాని నువ్వు తలచినదంతా తలచినట్టు చేయడానికి దేవతవో, రాక్షసుడివో కాదు; మరుగుజ్జు మనిషివి, తెలిసిందా!" అన్నాడు సిద్ధసాధకుడు కోపంగా.

కాలిభటులూ కేకలువేస్తూ బళ్ళాలు ఎత్తి పట్టుకుని కొండగుట్ట మీదికి పరిగెత్తసాగారు.

మరుగుజ్జు సేనాని తన అనుచరులతో కొండగుట్ట మీదికి రావడం చూస్తూనే, వాళ్ళను ఎదిరించేందుకు కృపాణజిత్తూ, గడెకొండా తమవాళ్ళను ఉసికొల్పారు. జయశీలుడు, వాళ్ళనుచూసి, సిద్ధసాధకుడితో, "సాధకా, ఇప్పుడు మనం రాణీ సైనికులకు సాయపడక తప్పదు. కృపాణజిత్తును చూశావా? వాడు ఆటవికుడిలా వేషం ధరించాడు. అయినా, నేను వాణ్ణి గుర్తించాను; వాడూ నన్ను గుర్తించి వుండవచ్చు," అన్నాడు.

ఇది విని సిద్ధసాధకుడు, మరుగుజ్జు రాణీతో, "నువ్వు ఇక్కడే వుండడం క్షేమం. మేము, నీ సైనికుల వెంట పోయి, నీ శత్రువైన గడెకొండడితోపాటు, మా శత్రువైన కృపాణజిత్తును కూడా హతమార్చి వస్తాం," అన్నాడు.

అంతలో నరవానరం ఒక బండరాయిని ఎత్తి పట్టుకున్నది. అది చూసి సిద్ధసాధకుడు విసుక్కుంటూ, "ఛీ,ఛీ! ఈ వానరానికి రాళ్ళు విసరడం తప్ప, మరే విద్యా చాతనైనట్టు లేదు. నా శూలంతో ఒక్కపోటు పొడిచి, పీడ విరగడ చేస్తాను," అంటూ శూలం పైకెత్తి, వేగంగా వానరంకేసి బయలుదేరాడు.

సాధకుడు దుస్సాహసం చేయబోయి, ప్రాణం మీదికి తెచ్చుకుంటాడని గ్రహించిన జయశీలుడు, అతణ్ణి ఆగమని, బాణం ఎక్కుపెట్టి వానరంకేసి వదిలాడు. బాణం గురితప్పి, కృపాణజిత్తు చేతిలో వున్న ఇనుప గొలుసుకు తగిలింది. ఆ మరుక్షణం కృపాణజిత్తు తలఎత్తి చూసి, ఆ బాణం వదిలిన వాడు తన శత్రువైన జయశీలుడని గుర్తిం

చాడు. ఆ నిమిషం వరకూ అతడికి, ఆ వచ్చిన వాళ్ళు ఎవరో మామూలు మనుషులని తప్ప, జయశీలుడని తెలియదు. సిద్ధసాధకుణ్ణి అతడేనాడూ చూసి వుండలేదు.

కృపాణజిత్తు, గడెకొండతో, "ఓయీ, గడెకొండా! ఇది శత్రువులను దెబ్బతీయడానికి తగిన సమయం కాదు. మనం ఇక్కడి నుంచి త్వరగా వెళ్ళిపోవడం క్షేమమవుతుంది," అంటూ నరవానరాన్ని కొండగుట్ట వెనక్కు మళ్ళించబోయాడు.

ఈ లోపల గడెకొండ, జయశీల సిద్ధసాధకులకేసి ఒకమారు చూసి, కృపాణజిత్తుతో, "అయ్యా, మహాకాయా! మీ ఆజ్ఞను కాదనను. కాని, మీరు నరవానరంతో ఒక్క ఊపున పోయి పడి, ఆ విల్లంబులు పట్టినవాణ్ణీ, శూలంవాణ్ణీ చంపలేరా? మేమా సమయంలో దుష్టరాణీ సైనికులందర్నీ, మా బళ్ళాలతో నిలువునా చీల్చి చెండాడగలం," అన్నాడు.

ఆ మాటలకు కృపాణజిత్తు కళ్ళెర్రచేసి, నరవానరాన్ని గుట్ట దిగువకు లాక్కుపోతూ, "గడెకొండా! నేనేమైనా నీ తలలోవున్న ఊకలజాతిపక్షినైన రాబందుననుకున్నావా – అలా గాలిలో ఎగిరిపోయి శత్రువులమీద పడడానికి? వాళ్ళను చంపే ఉపాయం వేరే వున్నది. ముందు అందరూ గూడేనికి పారిపోయి రండి, తెలిసిందా?" అన్నాడు.

ఆ వెంటనే గడెకొండ తన అనుచరులకు కొండగుట్ట దిగి గూడేనికి పరిగెత్తమని ఆజ్ఞ ఇచ్చాడు. అందరూ గుట్ట దిగువకేసి బయలు దేరారు. శత్రువులు పారిపోతున్నారని చూస్తూనే జయశీలుడు, మరుగుజ్జు సేనానితో, "సేనానీ, ఇదే నీకు మంచి అవకాశం. అందిన శత్రు



వులమీద బళ్ళాలు ప్రయోగించు, అందని వాళ్ళమీద గుట్టపైనుంచి రాళ్ళు దొర్లించి, ఎంతమందిని పరలోకానికి పంపగలవో చూడు," అని హెచ్చరించాడు.

మరుగుజ్జుసేనాని, తన భటులను పెద్దగా హెచ్చరిస్తూ, "ఒరే, వీరశూర గడెకారిరాణి భటులారా! బెబ్బులుల్లా, కొదమసింగాల్లా ముందుకురికి, గడెకొండ ముఠావాళ్ళను బళ్ళాలతో పొడవండి. భయంకరజంతువు పారిపోతున్నది. దాని భయం మనకికలేదు," అన్నాడు.

ఆ మాటలతో మరుగుజ్జు భటులు ఉత్సాహంపొంది ముందుకురికారు. వాళ్ళకు పారిపోతున్న గడెకొండ పాటేలు రౌతులూ, బళ్ళెం భటులూ కొందరు చిక్కారు. రాణీ భటులు వాళ్ళను బళ్ళాలతో పొడిచి, ఏటవాలుగా వున్న గుట్ట కిందికి వేగంగా దొర్లించసాగారు.



ఇది చూసిన సిద్ధసాధకుడు ఉత్సాహంగా శూలం ఎత్తిపట్టుకుని, ''జై,మహాకాళా!'' అంటూ కొండలూ, గుట్టలూ దద్దరిల్లేలా కేక పెట్టి, ''జయశీలా, అలా చూస్తావేం? పద, ఆ గడెకొండ మరుగుజ్జులు నివసించే గూడెం, గుట్టకింద చెట్లచాటున కనిపించేదే! పోయి హఠాత్తుగా మీదపడి, కృపాణజిత్తునూ, గడెకొండగాడి మరుగుజ్జుల్నీ చీల్చి చెండాడుదాం,'' అన్నాడు.

ఆమాటలకు జయశీలుడు నవ్వి, ''సాధూ! మనకు ఈ గడెకొండ అనుచరులను చంపవలసిన అవసరం ఏమీలేదు. వాళ్ళు మనకేం శత్రువులుకాదు. వాళ్ళకూ,మరుగుజ్జురాణికీ ఏదైనా రాజీకుదిర్చే ప్రయత్నంచేద్దాం. అదే ఆలోచిస్తున్నాను. నువ్వు తొందరపడకు,'' అన్నాడు.

''మరి మన శత్రువైన కృపాణజిత్తు మాటేమిటి? వాడు మచ్చికచేసిన నరవానరం సంగతేమిటి? దాని సాయంతో ఆ దుర్మార్గుడు, ఈ చుట్టుపక్కల యాభై కోసుల ప్రాంతానికి చక్రవర్తి కాగలడే!'' అన్నాడు సిద్ధసాధకుడు.

జయశీలుడు ఏదో జవాబు చెప్పబోయేంతలో మరుగుజ్జు సేనాని అక్కడికి వచ్చి, ''అయ్యా, శత్రువులు మా ధాటికి తట్టుకోలేక చచ్చినవాళ్ళు చావగా, మిగిలినవాళ్ళు వాళ్ళ గూడేనికి పారిపోతున్నారు. ఇప్పుడు మమ్మల్ని ఏం చేయమని తమ ఆజ్ఞ?'' అని అడిగాడు.

''అందరూ గుట్ట దిగి మీ రాణి దగ్గరకు వెళ్ళండి. మేం ఇద్దరం త్వరలోనే మీ గూడేనికి వస్తాం,'' అన్నాడు జయశీలుడు.

మరుగుజ్జు సేనాని తన భటుల్లో ఒకణ్ణి జయశీల, సిద్ధసాధకులకు తమ గూడేనికి దారి చూపేందుకు వదిలి, మిగతావాళ్ళతో విజయధ్వానాలు చేస్తూ, మరుగుజ్జురాణీ వున్న చోటుకు బయలుదేరాడు.

సిద్ధసాధకుడు కొంచెంసేపు గడెకొండ వాళ్ళ గూడెంకేసి చూసి, జయశీలుడితో ''జయశీలా! మనం అనవసరంగా, ఈ మరుగుజ్జు వెధవలమధ్య వచ్చి పడడం, మనదే తప్పు. ఇంతకూ మనం బయలుదేరిన పనేమిటి?'' అన్నాడు తీవ్రస్వరంతో.

''సాధకా, కాస్త శాంతించు. మనం కోరి కావాలని ఇక్కడికి వచ్చి పడలేదు, అవునా? దీనికంతకూ కారణం, ఆ మొసలి ఆకారం దుష్టుడు మకరకేతు! అపహరించబడ్డ హిరణ్యపురం రాజు కనకాక్షుడి పిల్లల్ని తిరిగి తెచ్చేందుకు బయలుదేరిన మనం, ఇలా అరణ్యవాసుల తగవులమధ్య చిక్కుకుపోవడం, నాకూ ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఏమైనా, మనం ఈ ప్రాంతం నుంచి బయలు

దేరిపోయే లోపల, ఆ కృపాణజిత్తును మాత్రం పరలోకానికి పంపితీరాలి!'' అన్నాడు జయ శీలుడు కోపంగా.

''మహాకాలుడి దయవల్ల ఆ పనితోపాటు, వాడి వెంటవున్న నరవానరాన్ని కూడా చంపి చర్మం వలిపించాలి. అలాంటి వింతమృగాల చర్మాలమీద పద్మాసనం వేసి కూర్చుని ధ్యానం చేస్తే - వచ్చే జన్మలో కాకపోయినా, ఆ పైజన్మలో నైనా మహారాజయోగం పడుతుందని, మా గురువుగారు చెప్పగా విన్నాను. సరే, ఇకపద, శోషవచ్చేంత ఆకలిగా వున్నది. మరుగుజ్జు రాణీ గూడేనికి చేరదాం,'' అంటూ సిద్ధసాధ కుడు వెనుదిరిగి బయలుదేరాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఇలా కొండగుట్ట మీద మాట్లాడుకుంటూ వుండగా, దిగువనున్న చెట్లచాటున నిలబడి మరుగుజ్జు గడెకొండా, కృపాణజిత్తూ తమకు కలిగిన ఓట మికి నువ్వేకారణం అంటూ, ఒకరినొకరు నిందించుకోసాగారు.

''అయ్యా, మహాకాయా! మీది భారీ శరీ రమేకాని, దానికి సరితూగే భారీ గుండెబలం మాత్రం మీలో లేదు. మాకన్న మీరే ముందుగా శత్రువుల నుంచి పారిపోయే ప్రయత్నం చేశారు. మీరు మచ్చిక చేశామని చెప్పే, ఈ నరవానరం మిమ్మల్నే చంపే ప్రయత్నం చేసింది,'' అన్నాడు గడెకొండ.

ఆ మాటకు కృపాణజిత్తు గట్టిగా పళ్ళు కొరికి, ''ఒరే, గుడ్డికొండా! నేను శత్రువుల నుంచి పారిపోలేదు; ఇది సమయం కాదని తిరోగమించాను - అంతే! నాకేసి బాణం కొట్టిన జయశీలుడనే పరమశత్రువును, రేపు సూర్యోదయం లోపల చంపకపోతే, నా పేరు కృపాణజిత్తు కాదు, నక్కజిత్తు! ఇక ఆ నర వానరం సంగతా? అది కోతిపిల్లలా నే చెప్పి నట్టు విని తీరుతుంది. అందుకు రుజువు...'' అంటూ నరవానరానికి, గడెకొండను చూపి, చేతులు వూపాడు.

ఆ మరుక్షణం నరవానరం మెరుపులా పోయి గడెకొండను ఎత్తి పట్టుకుని, భయం కరంగా అరవసాగింది. తమ యజమాని ప్రాణాపాయస్థితిలో ఉన్నాడని చూస్తూనే, గడెకొండ అనుచరులు బళ్ళాలు ఎత్తి కేకలు వేస్తూ నరవానరం, కృపాణజిత్తుల మీదికి రాసాగారు. - (ఇంకావుంది)



# సంతోష రహస్యం!

కృష్ణగిరి జమీందారు దివాణంలో గుమాస్తా ఉద్యోగం చేసే శివయ్య ఎప్పుడూ చిరునవ్వుతో కనిపించేవాడు. అంత చిన్న ఉద్యోగంతో గంపెడు సంసారాన్ని గుట్టుచప్పుడు కాకుండా ఎలా నెట్టుకు వస్తున్నాడా అని, అదే దివాణంలో అతడికన్నా కాస్త పెద్ద ఉద్యోగం చేస్తున్న మాధవయ్యకు ఆశ్చర్యంగా ఉండేది. అతనికి శివయ్య కన్నా ఎక్కువ జీతం. అయినా ఎప్పుడూ ఎవరిదగ్గర అప్పు చేద్దామా అని ఆలోచిస్తూ ఉండేవాడు. అతడు ఒకనాడు మధ్యాన్నం భోజన సమయంలో శివయ్యతో తన సంశయాన్ని వెలిబుచ్చాడు.

శివయ్య నవ్వుతూ, ''అదేం పెద్ద కార్యం కాదు బాబూ! వచ్చే జీతాన్ని నాలుగు భాగాలు చేస్తాను. మొదటి భాగాన్ని అప్పులు తీర్చడానికీ, రెండవ భాగాన్ని సొంతానికీ, మూడవ భాగాన్ని ధర్మ కార్యాలకూ ఉపయోగించుకుంటూ నాలుగవ భాగాన్ని వడ్డీలకు ఇస్తూ ఉంటాను. అంతే,'' అన్నాడు.

''నీకొచ్చే జీతంతో ఇన్ని పనులు చేస్తూ వడ్డీలకు వేరే తిప్పుతున్నావా? నమ్మశక్యంగా లేదు. కాస్త వివరంగా చెప్పు,'' అన్నాడు మాధవయ్య మరింత ఆశ్చర్యంతో.

''మొదటి భాగం అప్పులు తీర్చడానికి అంటే, కన్నవాళ్ళను పోషించడానికి ఖర్చు చేస్తాను. రెండవ భాగాన్ని సొంతానికి అంటే, నాకూ నా భార్యకూ ఉపయోగించుకుంటాను. మూడవ భాగాన్ని ధర్మకార్యాలకు అంటే తోడబుట్టిన అక్కచెల్లెళ్ళకోసం వినియోగిస్తాను. ఇక నాలుగవ భాగాన్ని వడ్డీలకు అంటే, పిల్లలకు నాలుగు అక్షరం ముక్కలు నేర్పి సక్రమంగా పెంచి పెద్ద చేయడానికి ఉపయోగిస్తున్నాను. రేపటికి మన అవసరాల్లో ఆదుకునేది పిల్లలేగనక, వాళ్ళకు చేసే ఖర్చు వడ్డీకి ఇచ్చినట్టేకదా,'' అన్నాడు శివయ్య చిన్నగా నవ్వుతూ.

ఆదాయం తక్కువయినప్పటికీ, దానిని అవసరాలకు తగ్గట్టు ఖర్చు చేయడమే శివయ్య సంతోషానికి కారణం అని మాధవయ్య గ్రహించాడు.

–మంజుభారతి



బేతాళ
కథలు

# సత్యాన్వేషి!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా! ఏ లక్ష్యం సాధించదలచి నువ్విలా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. లక్ష్యం స్పష్టంగా నిర్దేశించుకున్న వివేకులూ, తపస్సంపన్నులూ సైతం ఒక్కొక్కసారి అనాలోచితంగా క్షణికమైన నిర్ణయాలతో, తమ జీవిత లక్ష్యాలకు దూరమై, అపమార్గం పాలవుతారు. నువ్వుఅలాంటి పొరబాటు చేయకుండా ఉండగలందులకు వీలుగా, నీకు శశాంకుడనే ఒక తపస్సంపన్నుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:



శశాంకుడు సువర్ణపురి రాజపురోహితుడి ఏకైక కుమారుడు. రాజు మార్తాండవర్మ కుమారుడు స్వర్ణకీర్తి, శశాంకుడూ ఒకే ఈడు వాళ్ళు. పదహారవయేట వరకు ఒకే గురుకులంలో విద్యాభ్యాసం చేశారు. బాల్యం నుంచి మంచి మిత్రులు.

రాజు మార్తాండవర్మ తన కుమారుణ్ణి క్షాత్రవిద్యలు అభ్యసించడానికి వింధ్యపర్వత సానువులలో ఉన్న విష్ణుచంద్రుడి గురుకులానికి పంపాలని నిర్ణయించాడు. అందువల్ల రాకుమారుడు స్వర్ణకీర్తి, తన మిత్రుణ్ణి వదిలి వెళ్ళవలసి వచ్చింది.

శశాంకుడికి చిన్నప్పటినుంచే ప్రాపంచిక విషయాలపట్ల ఒక విధమైన అనాసక్తత ఉండేది. అది క్రమంగా విరక్తిగా పరిణమించింది. లౌకిక సుఖాలను త్యజించి, తపస్సు చేయడానికి సమీప అరణ్యానికి వెళ్ళాడు. కొన్ని సంవత్సరాలపాటు కఠోర తపస్సు చేశాడు. కొంతకాలానికి ఫలాలనూ, కందమూలాలనూ భుజించడం కూడా మానివేశాడు. కేవలం తులసితీర్థంతోనే ప్రాణాలు నిలుపుకుంటూ, తపస్సు ద్వారా అనేక సిద్ధులు సాధించాడు. నీళ్ళమీద నడవగలిగేవాడు. గాలిలో ఎగరగలిగేవాడు. అయినా, లౌకికశక్తులన్నీ కేవలం క్షణికాలు; మరణాన్ని జయించే మహోన్నతస్థితిని పొందాలి, అదే శాశ్వతమైనది అని భావించి తన కఠోర తపస్సును కొనసాగించాడు.

శశాంకుడు చేస్తూన్న తపస్సు గంధర్వ లోకంలో కలవరం పుట్టించింది. శశాంకుడు చేస్తూన్న కఠోర తపస్సును చూసి గంధర్వులు ఆశ్చర్యపోయారు. తన సింహాసనం ఆక్రమించడానికే శశాంకుడు ఇలా కఠోర తపస్సు చేస్తున్నాడని అనుమానించి గంధర్వరాజు భయకంపితుడయ్యాడు. శశాంకుడిచేత ఏదైనా పాపకార్యం చేయిస్తే ఆయన తపోశక్తి నశించిపోగలదని ఆశించి, అందుకొక పథకం ఆలోచించాడు.

గంధర్వరాజు దైవజ్ఞుడి రూపంతో సువర్ణపురికి వెళ్ళి రాజును దర్శించి, ''రాజా! తమ కుమారుడు స్వర్ణకీర్తికి ఈ భూప్రపంచానికే చక్రవర్తి అయ్యే యోగం ఉన్నది. అయితే చిన్న అవరోధం ఏర్పడింది. దానిని తొలగించడం తండ్రిగా నీ బాధ్యత కాదా?'' అన్నాడు.

''నా బాధ్యత నెరవేరుస్తాను. ఏమిటో సెలవివ్వండి స్వామీ,'' అన్నాడు రాజు.

''సర్వజీవకోటి యాగం చేయాలి. అంటే, మీ రాజ్యంలో వున్న జంతుపక్షిజాతులన్నింటి

లోనూ ఒక్కొక్క ప్రాణిని తెచ్చి యజ్ఞంలో బలి ఇవ్వాలి,'' అన్నాడు దైవజ్ఞుడు.

''అలాగే!'' అన్నాడు రాజు.

''అయితే, ఒక్క విషయం!'' అని ఆగాడు దైవజ్ఞుడు. ''ఏమిటి?'' అని అడిగాడు రాజు.

''జంతువులను మామూలు మనిషి బలి ఇవ్వకూడదు. ఆకలిదప్పులను జయించిన తపోసంపన్నుడే ఆ పని చేయాలి. తులసి తీర్థంతోనే ప్రాణాలు నిలుపుకున్న తపశ్శాలి అయితే మరీ ఉత్తమం!'' అన్నాడు దైవజ్ఞుడు.

''అలాంటి తపోధనుడు ఎక్కడున్నాడు?'' అని అడిగాడు రాజు.

''ప్రయత్నిస్తే ఫలితం సిద్ధిస్తుంది! మనో రథ సిద్ధిరస్తు,'' అని ఆశీర్వదించి దైవజ్ఞుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

తన కుమారుడు చక్రవర్తి కాగలడన్న ఊహ రాజు హృదయంలో ఆనందతరంగా లను పుట్టించసాగింది. ఎలాగైనా యజ్ఞాన్ని చేసితీరాలన్న నిర్ణయానికి వచ్చాడు. రాజ్యం లోని జంతు పక్షిజాతులన్నింటిలోనూ ఒక్కొక్క దానిని యజ్ఞానికి సిద్ధం చేయమని భటు లను ఆజ్ఞాపించాడు. రాజ్య ప్రజల క్షేమం కోసం మునుపెవ్వరూ చేయని సర్వజీవకోటి యజ్ఞం చేస్తున్నట్టు చాటింపు వేయించాడు. ఆ యజ్ఞాన్ని జరిపించడానికి ఆకలిదప్పులు లేని తపోసంపన్నుడు కావాలనీ, అటువంటి మహనీయుడు కంటబడితే తెలియజేయ మనీ ప్రకటించాడు.

ఐదవరోజు ఒక బోయవాడు రాజదర్శ నానికి వచ్చి, అడవిలో ఒక ముని తపస్సు చేస్తున్నాడనీ, ఆయన ఆహారం తీసుకోవడం తాను ఎన్నడూ చూడలేదనీ చెప్పాడు.



రాజు మంత్రిని పిలిచి, ''తమరు వెంటనే వెళ్ళి, ఆ మునిని యజ్ఞ నిర్వహణకు పిలు చుకురండి. ఆయన ఏది అడిగినా ఇవ్వడానికి వెనుకాడకండి,'' అని ఆజ్ఞాపించాడు.

మంత్రి బోయవాడి వెంట అరణ్యానికి వెళ్ళి, శశాంకుణ్ణి కలుసుకుని సంగతి వివ రించి, ''మహాత్మా రాజ్యానికి అంతటికీ క్షేమం సమకూర్చే యజ్ఞం మీ హస్తాలతో నిర్వహిం చాలి. ప్రత్యుపకారంగా మీరేం కోరినా ఇవ్వడా నికి మహారాజు సిద్ధంగా ఉన్నారు. అంతేకాదు, రాజు తమను తన ప్రధాన సలహాదారుగా నియమిస్తారు. భావితరాలకు శిక్షణనిచ్చి తీర్చి దిద్దడానికి వీలుగా మీకు ఆశ్రమ సమీపంలోనే గురుకుల పాఠశాలను ఏర్పాటుచేయగలరు,'' అన్నాడు. అయితే శశాంకుడు అందుకు అంగీకరించక తలఅడ్డంగా ఊపుతూ, ''యజ్ఞం



పేరుతో జంతువులను వధించడం పాపం. అది నా సిద్ధాంతాలకు విరుద్ధం,'' అన్నాడు.

''రాజుగారు తమకు ప్రశాంతమైన ఉద్యానవనం మధ్య బ్రహ్మాండమైన భవనం నిర్మించి ఇవ్వగలరు. అందులో మీరు సకలవిధ సౌఖ్యాలనూ అనుభవించవచ్చు,'' అన్నాడు మంత్రి.

''అవన్నీ మానవులు ఆశించతగ్గ గొప్ప సంపదలే కావచ్చు. నా లక్ష్యసాధనకు అరణ్యమే సానుకూల ప్రదేశం,'' అన్నాడు శశాంకుడు.

మంత్రి మరేమీ మాట్లాడలేక రాజ్యానికి తిరిగివచ్చి, రాజుకు జరిగిన సంగతి చెప్పాడు. రాజు ఆవేశంతో, ''ఆ తపస్వికి, నా కుమార్తె నిచ్చి వివాహం జరిపించి, నా రాజ్యాన్ని అప్పగిస్తానని చెప్పు,'' అన్నాడు.

రాకుమారి భార్గవి తండ్రి మాటలు విని దిగ్భ్రాంతి చెందింది. కుమార్తె భయాన్ని గ్రహించిన రాజు, ''భయపడకు, మొదట యజ్ఞం పూర్తికానీ. ఆ తరవాత జరగవలసినవన్నీ నేను చూసుకుంటాను,'' అని ధైర్యం చెప్పాడు.

మునిని వంచించాలన్న తండ్రి కుతంత్రం నచ్చకపోయినప్పటికీ, ప్రజల క్షేమందృష్ట్యా భార్గవి తండ్రిమాట కాదనలేక మౌనం వహించింది.

రాకుమారి మంత్రి వెంట అరణ్యానికి బయలుదేరింది. మంత్రి మునిని దర్శించి, ''మహాత్మా! తమరు వచ్చి యజ్ఞం జరిపించినట్టయితే, మా రాకుమారి భార్గవి తమకు అర్ధాంగి కాగలదు. రాజు మార్తాండవర్మ తదనంతరం తమరే సువర్ణపురాధీశులు కాగలరు. ఇది మహారాజుగారి విన్నపం!'' అన్నాడు.

శశాంకుడు యువరాణిని చూసి ఆమె అద్భుత సౌందర్యానికి ముగ్ధుడయ్యాడు. అనిర్వచనీయమైన విచిత్ర అనుభూతికి లోనయ్యాడు. అంతవరకు ఉన్న జీవిత లక్ష్యాన్ని మరిచిపోయి, ''ఈ సౌందర్యరాశిని వివాహమాడి, రాజ్యానికి రాజునవుతాను. సరే.. అలాగే,'' అన్నాడు.

మంత్రి తెచ్చిన బంగారు రథం ఎక్కి రాజధానికి చేరుకున్నాడు.

యజ్ఞవాటిక సిద్ధమయింది. వేలాది జంతువులు, పక్షులు విశాలమైన మైదానంలోకి చేర్చబడ్డాయి. రాజూ, మంత్రీ వెంట రాగా శశాంకుడు చేతిలో ఖడ్గం ధరించి యజ్ఞకుండాన్ని సమీపించాడు. యజ్ఞకుండానికి పక్కన బలికి సిద్ధంగా ఒక ఏనుగును నిలబెట్టారు. ప్రథమ బలిగా ఏనుగును నరకడానికి శశాంకుడు ఖడ్గాన్ని పైకెత్తాడు. జరుగనున్న దారుణాన్ని గ్రహించి ఏనుగు భయంతో తొండమెత్తి ఘీంకరించింది. మరుక్షణమే

అక్కడ చేరిన జంతువులన్నీ ఒక్కసారిగా దిక్కులు పిక్కటిల్లే విధంగా దీనంగా విల పించాయి. శశాంకుడు ఉలిక్కిపడి ఒకసారి చుట్టుపక్కల కలయచూసి, చేతిలోని ఖడ్గంతో తన శిరస్సు యజ్ఞకుండంలో పడేలా ఖండించు కున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా! శశాం కుడు రాకుమారి అద్భుత సౌందర్యానికి ముగ్ధుడై, రాజ్యకాంక్షతో జంతుబలి ఇవ్వ డానికి అంగీకరించాడు కదా? మరి, జంతువు లకు బదులు తన శిరస్సునే ఖండించుకున్న ఆయన విపరీత చర్యకు కారణం ఏమిటి? జంతువులన్నిటినీ ఒకేచోట ఒక్కసారిగా చూడ డంతో భయభ్రాంతుడై చిత్త చాంచల్యానికి లోనయ్యాడా? లేక రాజు మనోగతాన్ని గ్రహించి, యజ్ఞం కాగానే తనను మోసగించగలడని ఊహించి, ఆశాభంగంతో ఈ దారుణానికి పూనుకున్నాడా? శశాంకుడి దారుణ చర్యకు అసలు కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శశాంకుడు శిరస్సు ఖండించుకోవడానికి కారణం ఆయన భయభ్రాంతుడు కావడమో, చిత్తచాంచల్యా నికి లోనుకావడమో, ఆశాభంగానికి గురికావ డమో కాదు. శశాంకుడు ప్రాపంచిక విషయాల పట్ల అనురక్తి లేని సత్యాన్వేషి అన్న సంగతి మరిచిపోకూడదు. అటువంటి విరాగి రాకుమా రిని చూడగానే విచిత్రమైన అనుభూతికి లోనై, రాజ్యకాంక్షతో మంత్రి వెంట బయలు దేరాడు. అది గంధర్వుల మాయాజాలం! అంటే గంధర్వులు ఆయన మనసులో భ్రమను కల్పించారు. ఏనుగు ఘీంకారం; జంతువుల, పక్షుల దీనాలాపనలు మంచు తెరలాంటి ఆ భ్రమను తొలగించాయి. ఆ క్షణమే ఆయన తన తప్పును గ్రహించాడు. ఇన్ని అమాయక ప్రాణులను బలి ఇవ్వడానికి అంగీకరించిన పాతకానికి ఈ జన్మలో నిష్కృతి లేదని భావించాడు. ప్రాయశ్చిత్తంగా శిరస్సును ఖండించుకుని మునుముందైనా పరిణతి చెందిన మానవుడిగా జన్మించి, తన లక్ష్యాన్ని సాధించుకోవచ్చునన్న ఆశయంతోనే ఆ చర్యకు ఒడిగట్టాడు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. - (కల్పితం)



మన పూర్వగాథలు: 5

# దేవుడితో జూదం!



భద్రావతీ నగరంలో ఒకానొకప్పుడు చాలా జూదగృహాలు ఉండేవి. ఆ నగరంలోని సోమ దత్తుడనే యువకుడు జూదమాడడంలో కడు నేర్పరి. సోమదత్తుడు పందెం అంటూ దిగా డంటే తప్పక గెలుపొందేవాడు. అందువల్లే అతడితో పందెం కాయడానికి ఇతర జూద రులు వెనకాడేవాళ్ళు. అయితే, సోమదత్తు డిలో ఒక సుగుణం కూడా ఉండేది. జూదంలో గెలుచుకున్న సొమ్మును అప్పటికప్పుడే పేద సాదలకు పంచిపెట్టేవాడు.

నగరం శివారు కొండగుహలో ఒక ముని నివసిస్తూ ఉండేవాడు. ఆ ముని అంటే సోమ దత్తుడికి ఎనలేని గౌరవాదరాలు. తరచూ, పళ్ళూ, ఫలహారాలు తీసుకువెళ్ళి ఆయనకు ఇచ్చేవాడు. ''స్వామీ! నేను అజ్ఞానిని. మంచీ, చెడూ తెలియని మూర్ఖుణ్ణి! దేవుణ్ణి ఎలా ప్రార్థించాలో కూడా ఎరుగను. నాపై దయ చూపమని తమరే దేవుడికి నా మొర వినిపిం చాలి!'' అని చెప్పేవాడు.

అందుకు ముని, ''విచారించకు, నాయనా! నిత్యం, నిరంతరం దేవుణ్ణి తలుచుకుంటూ, నువ్వు చేసే ప్రతి పనినీ దేవుడికి సమర్పించు. అదే నీకు మేలు చేస్తుంది!'' అని హితవు చెప్పేవాడు.

ఒకనాడు ఉదయం నుంచి సన్నగా జల్లులు పడుతున్నాయి. ఏ జూదగృహానికి వెళ్ళినా, ఒక్కరుకూడా సోమదత్తుడితో జూదం ఆడ డానికి సిద్ధంగా లేరు. సాయంకాలమయింది. సోమదత్తుడికి ఆకలి దహించి వేస్తున్నది. డబ్బులు సంపాయించడానికి జూదం తప్ప మరొకమార్గం అతనికి తెలియదు. ఏం చేయ డానికీ తోచక, నగరానికి ఈశాన్యదిశలో చెట్ల

బిందుసార్

మధ్య ఉన్న చిన్న శివుడి గుడి దగ్గరికి వెళ్ళాడు. దీపం కాంతిలో, దేవుడి విగ్రహం ముందు నైవేద్యానికి పెట్టిన ఫలహారం కనిపించింది. సోమదత్తుడు రెండు చేతులెత్తి దేవుడికి మొక్కుతూ, ''నాకు ఆకలి దహిస్తున్నది. నీ ముందున్న ప్రసాదాన్ని తీసి తినవచ్చా?'' అని అడిగాడు.

''హాయిగా భుజించు! చాలా సంతోషం!'' అన్న మాటలు విన్నట్టు అతనికి అనిపించింది.

అమితానందంతో, కృతజ్ఞతాభావంతో అతడి కళ్ళు చెమ్మగిల్లాయి. ''ప్రభూ! నిన్ను నేను ఏవిధంగా సేవించగలను? నీ దయకు ఎలా పాత్రుణ్ణికాగలను? నిన్నుపూజించే మంత్రాలు, కీర్తించే గీతాలు ఈ మందమతికి తెలియవు కదా! నాకు తెలిసిందల్లా ఒక్కటే - జూదం! 'నువ్వు చేసే ప్రతి పనినీ దేవుడికి కానుకగా సమర్పించుకో!' అని గుహలోని ముని చెబుతాడు. నాకు తెలిసిన విద్యను నీ ఎదుట ప్రదర్శించమన్నావా? అందులోనూ ఒక సమస్య! ఒక్కణ్ణే జూదం ఎలా ఆడను? కనీసం మరొక చెయ్యి కావాలి కదా?'' అంటూ విచారించి, మరుక్షణమే పట్టరాని ఆనందంతో, ''ఆహా... ఇప్పుడు తెలిసిపోయింది. నువ్వే నా ఉజ్జీవి. నా కుడిచెయ్యి నీ ప్రతినిధి. నా ఎడమ చెయ్యి నా ప్రతినిధి. ఏమంటావు? సరేనా?'' అని ఆగాడు.

దేవుడు ఎలాంటి అభ్యంతరమూ చెప్పినట్టు అతనికి అనిపించలేదు.

''జూదంలో నేను ఓడిపోతే నేను తొడుక్కున్న నా చిరిగినచొక్కా నీకిస్తాను. నాకున్నది అది ఇక్కటే. మరి నువ్వేగనక ఓడిపోతే, ఇక్కడున్న వాటిలో నాకిష్టమైనది నేను తీసుకుంటాను. ఇదీ పందెం. నీకు సమ్మతమే కదా?'' అన్నాడు సోమదత్తుడు మళ్ళీ ఉత్సాహంగా.



ఇందుకు కూడా దేవుడు సమ్మతించినట్టు సోమదత్తుడు భావించాడు. చిటికలో చిన్న ఆటను రూపొందించాడు. కుడిచేత్తో దేవుడి పక్షంలోనూ, ఎడమ చేత్తో తన పక్షంగానూ ఆటను మొదలుపెట్టి, వేగంగా ఆడసాగాడు.

ఉన్నట్టుండి అతడు చప్పట్లు కొడుతూ, ''దేవుడా! నువ్వు ఓడిపోయావు! ఓడిపోయావు! దిగులుపడకు. నువ్వు జూదమాడడం ఇదే మొట్టమొదటిసారి అనుకుంటాను. అయినా, మన ఒప్పందం ప్రకారం ఇక్కడున్నవాటిల్లో నాకు నచ్చింది తీసుకుంటాను. సరేనా? నన్ను చూడనీ,'' అంటూ దీపం వత్తిని ఎగదోసి, చుట్టుపక్కల ఒకసారి కలయజూశాడు. అక్కడ కొన్ని దేవతల విగ్రహాలు ఉన్నాయి. అతడి దృష్టి దుర్గ విగ్రహం మీద పడింది. ''ఆహా, ఎంత అందంగా ఉన్నదీ విగ్రహం! నాకు తల్లి లేదు. ఈ ధుర్గమ్మనే ఇంటికి తీసుకుపోయి నా తల్లిగా చూసుకుంటాను,'' అనుకుంటూ విగ్రహాన్ని భుజం మీదికి



ఎత్తుకున్నాడు.

"ఆగు! ఇంట్లో దేవతావిగ్రహాలను ప్రతిష్ఠించడం అంత సులభం కాదు. క్రమం తప్పకుండా పూజాపురస్కారాలు జరపాలి. పూజలు జరపడానికి పూజారి కావాలి. పైగా గుళ్ళోని విగ్రహం దొంగిలించావన్న నేరం నీ మీదికి వచ్చి, శిక్ష పడవచ్చు," అన్న మాటలు వినిపించినట్టవడంతో, సోమదత్తుడు, "నిజం! నిజం!" అంటూ విగ్రహాన్ని యథాస్థానంలో ఉంచి, "మరి నేను జూదంలో గెలుపొంది కూడా, వట్టిచేతులతో వెళ్ళవలసిందేనా?" అన్నాడు.

"ఇప్పుడు నీకు కావలసింది తల్లికాదు; భార్య! కొంతసేపు నావెనక దాగి ఉన్నావంటే ఒక అప్సరస నీ ఎదుటికి వస్తుంది!" అన్న మాటలు వినిపించినట్టయింది. వెంటనే వెళ్ళి శివుడి విగ్రహం వెనకగా వున్నాడు.

అది ఒక శుభప్రదమైన పున్నమిరేయి. యేటా ఆ పున్నమిరాత్రి తిలోత్తమ అనే అప్సరస దివినుంచి భువికి దిగివచ్చి, ఆలయ విగ్రహం ముందు నాట్యం చేసి వెళ్ళడం అలవాటు. అదేవిధంగా, ఆ రాత్రికూడా తిలోత్తమ దిగివచ్చి నాట్యం ప్రారంభించింది. ప్రదర్శన పూర్తికాగానే విగ్రహం వెనక నుంచి వెలుపలికి వచ్చిన సోమదత్తుడు, "నువ్వెవరో నాకు తెలియదు. అయినా నువ్వు నన్ను పెళ్ళాడగలవని దేవుడు చెప్పాడు!" అన్నాడు అమాయకంగా.

ఆ మాటలకు ఆశ్చర్యం చెందిన అప్సరస అతడికేసీ, విగ్రహంకేసీ వింతగాచూసింది. ఆ తరవాత ఏదో గ్రహించినదానిలా, "అలాగా! సరే, రా వెళదాం!" అంటూ ముందుకు దారి తీసింది. పండువెన్నెలలు కురుస్తూన్న నిండు పున్నమికాంతిలో ఆమె ముగ్ధమనోహర సౌందర్యాన్నిచూసిన సోమదత్తుడి నోట మాటరాలేదు.

అప్సరస మందహాసం చేసి, 'నేను నిన్ను వివాహమాడితే నేను నివసించడానికి మంచి భవనంఉన్నదా? నాకు సేవలందించడానికి పరిచారికలు ఉన్నారా? అనుభవించడానికి కావలసిన సంపదలు నీదగ్గర ఉన్నాయా?" అని అడిగింది.

"లేదు!" అన్నట్టు సిగ్గుతో తల దించుకున్నాడు సోమదత్తుడు.

"అంటే, నీకు కావలసింది భార్యమాత్రమే కాదు;గృహమూ,సంపదలూ కూడా. అవునా?" అని అడిగింది అప్సరస.

"అవును," అన్నాడు సోమదత్తుడు.

"విచారించకు. మానవుడినైన నిన్ను అప్సరసనైన నేను వివాహమాడలేను. అయితే, నీకు వివాహమయ్యే మార్గం చెబుతాను," అంటూ ఒక్క క్షణం కళ్ళు మూసుకుని, ఆ తరవాత అతడి చెవిలో ఏదో చెప్పి అదృశ్యమైపోయింది.

కొన్ని రోజులు గడిచాయి. ఆ రాజ్యపు రాజకుమారి కమలకుమారికి వింత వ్యాధి సంక్రమించింది. అన్నపానీయాలు ముట్టడం లేదు. మూసిన కళ్ళు తెరవకుండా, మంచం పట్టి, "నేను తిలోత్తమను. ఇంద్రసభకు వెళ్ళాలి... నాట్యం చేయాలి. ఎక్కడ నా చెలి కత్తెలు?" అంటూ అప్పుడప్పుడు ఏవేవో పలవరించసాగింది.

రాజవైద్యులు ఆమె వ్యాధిని నయం చేయలేకపోయారు. రోజురోజుకు కుమార్తె పరిస్థితి దిగజారడంతో, పరిస్థితి విషమిస్తున్నదని ఆందోళన చెందిన రాజు, "రాజకుమారి వ్యాధిని నయంచేసినవారికి కోరినది ఇస్తా" నని చాటింపు వేయించాడు.

ఆ చాటింపు విని, తిలోత్తమ చెప్పిన మాట ప్రకారం రాకుమారిని ఆవహించిందని గ్రహించిన సోమదత్తుడు, రాజును దర్శించి, తాను రాకుమారి వ్యాధిని నయం చేస్తానని చెప్పాడు.

కుమార్తె ప్రాణంమీద అప్పటికే ఆశలు వదులుకున్న రాజదంపతులు, కన్నీరు మున్నీరుగా, "ప్రయత్నించు, నాయనా! భగవదనుగ్రహంతో నువ్వేగనక మా బిడ్డ వ్యాధి నయం చేయగలిగితే, ఆమెను నీకే ఇచ్చి వివాహం జరిపిస్తాము," అన్నారు.

సరే అని సోమదత్తుడు యువరాణి పానుపు దగ్గరికి వెళ్ళి, ఆమె చెవిలో, "తిలోత్తమా! నీ దయకు చాలా కృతజ్ఞుణ్ణి! ఇకనువ్వు రాకుమారినివదిలి వెళ్ళిపో," అన్నాడు మెల్లగా.

మరుక్షణమే రాకుమారి కళ్ళు తెరిచి, "ఆహా, ఏమిటీ చిత్రం! నా కలలో కనిపించిన నువ్వు నా ఎదుటే ఉన్నావు," అన్నది.

"నన్ను గురించి కలగన్నావా? ఏమిటా కల రాకుమారీ?" అని అడిగాడు సోమదత్తుడు.

రాకుమారి సిగ్గుతో నవ్వుతూ తల వంచుకున్నది.రాజదంపతుల ఆనందానికి అవధులు లేకపోయాయి. "కలలో ఒక అప్సరస, 'నువ్వు కళ్ళు తెర వగానే నీ ఎదుట నీకు కాబోయే భర్త కని పిస్తాడు,' అన్నది. ఆయన రూపం కూడా కనిపించింది," అని చెప్పింది రాకుమారి తల్లిదండ్రులతో.

రాకుమారికీ, సోమదత్తుడికీ ఘనంగా వివాహం జరిగింది. సోమదత్తుడికి రాజ్యపట్టాభిషేకం చేసి, రాజు వానప్రస్థానికి వెళ్ళాడు. సింహాసనాన్ని అధిష్ఠించగానే, సోమదత్తుడు శివుడి చిన్నగుడి ఉన్నచోట బ్రహ్మాండమైన శివాలయాన్ని నిర్మించాడు. అంతేకాక, రాజ్యంలో జూదాన్ని నిషేధిస్తూ, జూదరులకు పనిపాటలూ, జీవనోపాధీ కల్పించాడు.





# ధర్మమే దైవం

సోమనాధం, చింతపల్లి ఊరుకు దగ్గర్లో వున్న కొండమీది వరసిద్ధి వినాయకుడి గుడిలో ప్రధానోద్యోగి. అతడు ఉదయానే గుడికి బయల్దేరుతూండగా, అతడి భార్య సుబ్బ లక్ష్మి "మీకు ఆ మధ్య ఒకటికి రెండుసార్లు చెప్పాను, అమ్మాయికి పెళ్ళీడు వచ్చిందన్నది మీకు తెలియంది కాదు. పై ఏడు అబ్బాయి పైచదువులు చదవడానికి పట్నం వెళ్ళాలం టున్నాడు. మీ ఆదాయం ఏమో, ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టు వున్నది. మన ఈ సమస్యలు ఎలా తీరుతాయో తెలియడం లేదు. నాకేమో రాత్రుల్లో నిద్ర పట్టడం కూడా లేదు. నేను ఎంత చెపుతున్నా మీకు చీమ కుట్టి నట్టుగా కూడా లేదు!" అన్నది.

సోమనాధం భార్యకు సమాధానం చెప్ప కుండా మౌనంగా బయటికి వెళ్ళిపోయాడు. అతడికి ఏమీ పాలుపోవడం లేదు. తను చేస్తూన్న ఉద్యోగానికి మించి అదనంగా ఆదా యంవచ్చే మార్గమేదీ అతడికి తెలియదు.

సోమనాధం చదువు పూర్తిచేసి, ఉద్యోగం కోసం వెతుకుతున్న సమయంలో – ఆ ఊరి రైతులు చెరువులో పూడిక తీస్తూంటే, వినా యకుడి విగ్రహం ఒకటి బయటపడింది. ఊళ్ళోవున్న ధనికుడొకాయన అప్పటికప్పుడు గుడి కట్టించడానికి ముందుకొచ్చాడు. గుడి కట్టడం పూర్తయ్యాక, ఆ ధనికుడు ఊళ్ళో చదువుకుని నిరుద్యోగిగా వున్న సోమనాధాన్ని గుడిలో ఉద్యోగిగా నియమించి, గుడి నిర్వ హణ బాధ్యతలు అప్పగించి, జీతభత్యాలు ఏర్పాటు చేశాడు.

క్రమంగా గుడికి వచ్చే భక్తుల సంఖ్య పెరిగింది. వినాయకుడికి కోరిన కోరికలు తీర్చే దేవుడుగా ప్రసిద్ధి వచ్చింది. చుట్టుపక్కల గ్రామాల నుంచి కూడా భక్తులు రాసాగారు.

డా. గంగిశెట్టి శివకుమార్

క్రమక్రమంగా హుండీ ఆదాయం పెరిగింది. హుండీ ఆదాయం తీసి లెక్కపెట్టి, గుడి అభివృద్ధికీ , భక్తులకు సౌకర్యాలు కల్పించడానికీ, ఆ డబ్బును సోమనాథం ఖర్చు పెట్టేవాడు. పదిమందిలో ధర్మవర్తనుడనే పేరు సంపాయించాడు.

ఒక పక్క వినాయకుడి గుడి అభివృద్ధి చెందుతూంటే, సోమనాథం సంసారమూ పెరిగింది. చూస్తూండగానే అమ్మాయి పెళ్ళీడు కొచ్చింది; అబ్బాయి పెద్దచదువులకొచ్చాడు. అతడి ఆదాయం మాత్రం ఖర్చులకనుగుణంగా లేదు. అదే సుబ్బలక్ష్మి బాధ! అందువల్లే ఆమె దానిని గురించి రాత్రింబవళ్ళు తెగ ఆలోచిస్తోంది.

అసలు ఆమె ఉద్దేశం ఏమంటే - హుండీ ఆదాయంలో తాము కొంత వాడుకోవాలన్నది. సోమనాథం ఇది ఎప్పుడో గమనించాడు. ఆ పని అతడికిష్టం లేదు గనక, దానిని గురించి అంతగా పట్టించుకోలేదు. కానీ సుబ్బలక్ష్మి గట్టిపిండం. తన ప్రయత్నం మానుకోలేదు. అరగదీయటం ప్రారంభించాలేగాని రాయి అయినా ఒకనాటికి అరుగుతుందిగదా! సోమనాథం ఒక రోజు ఏ కళనున్నాడోగాని, "సరేలేవే! ఆలోచించి చూస్తాను. మరీ అంత తొందర పడితే ఎలా? నాలుగు రోజులాగు," అన్నాడు.

ఇది జరిగిన రెండో రోజు, గుడి ఆవరణలో తన గదిలో కూర్చుని, సోమనాథం పనిచూసుకుంటున్నాడు. ఇంతలో ఒక రైతు బస్తా బియ్యం, తన కుటుంబంతోసహా బండి దిగాడు.

అతడు, సోమనాథం దగ్గరికి వచ్చి, "అయ్యా, గుడిలో నిత్యం జరిగే అన్నదాన కార్యక్రమానికి , ఏదో ఉడతాభక్తిగా, నా వంతు ఒక బస్తా బియ్యం తెచ్చాను. తీసుకోగలరు," అన్నాడు.

"ఏదైనా మొక్కుబడా?" అని అడిగాడు సోమనాథం.



''అవును, మొక్కుబడే! నాకు పెళ్ళీడు కొచ్చిన ఒక అవిటి కూతురు ఉన్నది. దానికి ఎలా పెళ్ళి అవుతుందనేది, నా బాధ. పోయిన సంవత్సరం వచ్చి, స్వామివారికి మొక్కుకున్నాను. అమ్మాయికి పెళ్ళిజరిగితే, దంపతులతోపాటేవచ్చి బస్తా బియ్యాన్ని సమర్పించుకుంటానని – అదేం చిత్రమోగాని, ఏడాది తిరక్కుండానే అమ్మాయికి మంచి సంబంధం వచ్చింది. పెళ్ళవగానే మొక్కుబడితీర్చుకోవడానికివచ్చాం,'' అన్నాడు రైతు సంతోషంగా.

''అలాగా! మంచిది,'' అన్న సోమనాథం రైతు చెప్పినమాట గురించి కొంతసేపు తీవ్రంగా ఆలోచించి ఒక దృఢనిర్ణయానికి వచ్చాడు.

తర్వాత ఒకరోజు సుబ్బలక్ష్మి,సోమనాథాన్ని, ''నేను చెప్పిన విషయం ఆలోచించారా?'' అని అడిగింది.

''నువ్వు చెప్పినట్టు వినదలుచుకోలేదు,'' అన్నాడు సోమనాథం నిబ్బరంగా.

''మరి అమ్మాయి పెళ్ళి ఎలా చేస్తారు? అబ్బాయిని పైచదువులు ఎలా చదివిస్తారు?'' అన్నదామె ఈసడింపుగా.

సోమనాథం కొద్దిసేపు మౌనంగా వూరుకుని, ''చెప్పేది శాంతంగా విను. ఎక్కడెక్కడివారో వచ్చి స్వామిని దర్శించి కోరికలు కోరినంతనే స్వామి, వారి కోరికలు తీరుస్తున్నాడు. మనం నిత్యం ఆయన సేవలో వున్నాం. మన బాగోగులు ఆయన చూడకపోతాడా? ఆయన ఈ ఊళ్ళో వెలసినరోజునే, నాకు బతుకుతెరువు చూపించాడు. దొంగతనం చేసి,ఆయనదృష్టిలో పాపిని కాలేను. ధర్మబుద్ధితో కష్టపడి పనిచేసుకుంటూ పోతే, మంచిరోజులు వాటంతటవే వస్తాయి అన్నదాంట్లో, నాకు తిరుగులేని నమ్మకంవున్నది. మనం ధర్మాన్ని రక్షిస్తే, అది మనల్ని రక్షిస్తుంది. దైవం అంటే ధర్మస్వరూపమే కదా!'' అన్నాడు సోమనాథం నమ్మకంగా.

సుబ్బలక్ష్మికి జ్ఞానోదయం అయింది. మరేమీ మాట్లాడలేదు.ఆ తర్వాత ఆమె భర్తతో ఆ విషయం ఎప్పుడూ ఎత్తలేదు.

సోమనాథం నమ్మకం వట్టిపోలేదు. ఒక స్నేహితుడి ద్వారా ఎదురుచూడకుండా చిత్రంగా మంచి సంబంధం కుదిరి అమ్మాయి పెళ్ళి సులువుగానే చేయగలిగాడు. తెలివితేటలుండటంతో పిల్లవాడు చదువుల్లో వృద్ధిలోకి వచ్చాడు. ఆ విధంగా, సోమనాథానికి జీవితం ఎలాంటి సమస్యలూ లేకుండా ప్రశాంతంగా గడిచిపోయింది.



# మనదేశం గురించి తెలుసుకుందాం

సుప్రసిద్ధ విద్యావేత్త మాజీరాష్ట్రపతి డా. సర్వేపల్లిరాధాకృష్ణన్ గౌరవార్థం, యేటా ఆయన జన్మదినమైన సెప్టెంబర్ 5 వ తేదీన 'ఉపాధ్యాయ దినోత్సవం' జరుపుకుంటున్నాం. ఈ నెల క్విజ్ కూడా మన విద్యారంగానికి సంబంధించినదే. వాటిలో మీకు ఎన్నింటికి సరైన సమాధానాలు తెలుసో చదివి చూడండి.

1. 1955 వ సంవత్సరంలో కొల్‌కతాలో ' ఇన్స్టిట్యూట్ ఆఫ్ న్యూక్లియర్ ఫిజిక్స్'ను స్థాపించిన భారతీయ 'అంతరిక్ష భౌతిక' శాస్త్రవేత్త ఎవరు?
2. 1857 సిపాయిల తిరుగుబాటును అణచగలిగినందుకు దేవుడికి కృతజ్ఞత తెలుపుతూ బ్రిటిష్ ప్రభుత్వం సిమ్లాలో ఒక పాఠశాలను స్థాపించింది. ఆ పాఠశాల పేరేమిటి?
3. మన పురాణాలలో దేవతల 'గురువు' ఎవరు?
4. ''పై'' ఆధునిక విలువను లెక్కగట్టిన ఆధునిక భారతీయ గణితశాస్త్రజ్ఞుడు ఎవరు?
5. రూర్కీ విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేసినప్పుడు దాని పేరు వేరుగా ఉండేది. ఆ పేరేమిటో మీకు తెలుసా?
6. షేక్స్పియర్ నాటకాల తొలిసంకలనం ('ఫస్ట్ ఫోలియో') కలిగి ఉండడం చాలా అరుదైన విషయం. అలాంటి అరుదైన సంకలనాన్ని మనదేశంలోని ఒక విద్యాసంస్థ కలిగి ఉన్నది. ఆ విద్యాసంస్థ పేరేమిటి?
7. గుజరాత్‌లో రవి. జె. మత్తాయ్ స్థాపించిన ప్రధాన విద్యాసంస్థ పేరేమిటి?
8. మైసూర్ విశ్వవిద్యాలయ కులపతి ఒకరు అంతకు పూర్వం పాటియాలా సంస్థానంలో మంత్రిపదవిలో ఉండేవారు. ఆయనకు 'సర్దార్' అనే బిరుదు కూడా ప్రదానం చేశారు. ఆయన పేరేమిటి?

(సమాధానాలు వచ్చే సంచికలో)

## ఆగస్ట్ క్విజ్ సమాధానాలు

1. షణ్ముగం శెట్టి.
2. డా.జాకీర్ హుస్సేన్.
(1 సం. 11 నెలల 20 రోజులు).
3. 1989.
4. ప్రధానమంత్రి అటల్‌బిహారీ వాజ్‌పేయ్.
5. యాభై మంది.
6. ఉపాధ్యక్షుడు.
7. ఆంధ్రప్రదేశ్.
8. మాహే- పాండిచ్చేరి రాష్ట్రం.
9. కర్నాటక - శ్రావణ బెళగొళ.
10. లక్షద్వీపాలు.
11. జి.బి.పంత్ వ్యవసాయ విశ్వవిద్యాలయం.
12. డురాండ్ కప్.
13. సహీద్, స్వరాజ్.
14. కర్జన్ ప్రభువు.



# కుంభన్న నిద్ర

ఒక ఊళ్ళో గురవయ్య, గురవమ్మ అనే దంపతులున్నారు. వాళ్ళకు లేకలేక ఒక మగబిడ్డ కలిగాడు. ఆ బిడ్డ పుట్టాక ఉంగా అని ఏడ్వలేదు. కళ్ళు విప్పలేదు. కంగారు పడి మంత్రసాని గిల్లినా కొంచెం కదిలాడు తప్ప ఏడ్వలేదు. పాలు పట్టించబోతే మాత్రం నోరు తెరుస్తున్నాడు.

అలా వారం రోజులు గడిచాక వాళ్ళింటికి ఒక సాధువు వచ్చాడు. గురవయ్యాయనకు విషయం చెప్పి బాధపడ్డాడు. సాధువు, గురవయ్యను పిల్లవాడు పుట్టిన సమయం, నక్షత్రం అడిగి తెలుసుకొని, ఏవో లెక్కలు వేసి ఆశ్చర్యపోయి, ''ఆహా, సంగతి అదన్న మాట!'' అని ఒక క్షణం ఆగి, ''గురవయ్యా, నువ్వు అంతగా విచారపడవలసిందేమీ లేదు. నీ కొడుకు అంతో ఇంతో కుంభకర్ణుడి అంశన పుట్టాడు. త్రేతాయుగంలో కుంభ కర్ణుడు సగం నిద్రలో లేచి యుద్ధం చేసి చనిపోయాడు గదా - ఆ నిద్రమోజు తీరక ఇలా మళ్ళీ జన్మ ఎత్తాడు. ఆ కుంభకర్ణుడు ఏడాదిలో ఆరు నెలలు మెలకువగా వుండి, ఆరు నెలలు నిద్రపోయేవాడు. నీ కొడుకు మాత్రం ఏడాది పొడుగునా ప్రతిరోజూ చాలా సేపు నిద్రపోతూనే వుంటాడు. ఇప్పుడింకా రోజుల పిల్లవాడు కాబట్టి మొత్తం అంతా నిద్రే! ఏడిస్తే నిద్ర తేలిపోతుందని వాడు ఏడవడం లేదు, అంతే!'' అని చెప్పాడు.

సాధువు మాటలతో, గురవయ్య దంప తుల మనసుకు కాస్త ఊరట కలిగింది. వాళ్ళా కుర్రవాడికి ముద్దుగా కుంభన్న అని పేరుపెట్టి పెంచసాగారు. వాడు ఉదయం నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొని పాలు, ఫలహారం పుచ్చుకుని నిద్రపోయేవాడు. మళ్ళీ మధ్యాహ్న భోజనం, నిద్రా. సాయం త్రం ఫలహారానికీ, రాత్రి భోజనానికీ లేవడం తప్ప-మిగతా సమయమంతా వాడికి నిద్ర

''వసుంధర''

తోనే గడిచిపోయేది. ఏ పనీ చేయకుండా, ఆహారం మాత్రం తీసుకుంటూండడంవల్ల నేమో, వాడికి భారీ కాయం వచ్చింది.

అయిదు సంవత్సరాల వయసులో కుంభన్న బడికి వెళ్ళడం మొదలుపెట్టాడు. వాడు బడిదాకా నడవలేకపోతే, తండ్రి వాడిని ఒంటెద్దు బండిలో పంపేవాడు. కుంభన్న బండిలో నిద్రపోయేవాడు. బడిలో నిద్ర పోయేవాడు. ఈడుకు మించిన శరీరంతో వాడు బడిపిల్లల మధ్య రాక్షసుడిలా వుండే వాడు. తీరికవేళల్లో పిల్లలు వాడి శరీరంతో ఆడుకునేవాళ్ళు.

అలా కుంభన్నకు పదహారేళ్ళు వచ్చాయి. వాడికి మరింత మహాకాయం వచ్చింది కానీ అక్షరంముక్క అబ్బలేదు. కోపగించుకుంటే నిద్రాభంగం అవుతుందని కుంభన్న, తననెవ రేంచేసినా ఏమీ అనేవాడు కాదు. అందువల్ల, వాడంటే అందరికీ ఇష్టంగా వుండేది.

గురవయ్యకూ, గురవమ్మకూ కొడుకు భవిష్యత్తు గురించి బెంగపట్టుకున్నది. వాడిని మామూలు మనిషిని చేయాలని వాళ్ళు ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలించలేదు. అలాంటి సమయంలో, కుంభన్న జన్మ రహస్యం చెప్పిన సాధువు మళ్ళీ వాళ్ళింటికి వచ్చి విషయం తెలుసుకున్నాడు.

ఆయన ఒక రోజంతా వాడిని శ్రద్ధగా గమనించి, "నిద్రఎక్కువతప్పితే, మీ కుంభన్న చాలా తెలివైనవాడు. నిద్రకోసం వాడు ఎంతటి కష్టమైన పనినైనా చురుగ్గా చెయ్యగలడు. కాబట్టి వాడికి ఏ విద్యయినా తొందరగా వస్తుంది. గత జన్మలోని నిద్రాభంగ ఫలితం కూడా ఇక పూర్తయింది కాబట్టి, ఒక నెల రోజులపాటు నేను వాడికి విద్యాబుద్ధులు నేర్పుతాను," అన్నాడు.

సాధువు ఉపాయం ఫలించింది. నిద్ర పోవడం కోసం ఎంత కష్టమైన పాఠాన్నయినా



క్షణాల మీదే నేర్చుకుంటూ, నెల రోజుల్లో అన్ని సంవత్సరాల్లో మిగతావాళ్ళు చదివిన చదువంతా ఒంటపట్టించుకున్నాడుకుంభన్న. సాధువు వాడినెంతగానో మెచ్చుకొని, ''ఎంతో చురుకైనవాడివి. నీవిప్పుడు ఏ గురుకులానికైనా వెళ్ళి గొప్ప గొప్ప శాస్త్రాలు అభ్యసించు. లోకానికెంతో ఉపయోగపడతావు,'' అన్నాడు.

''స్వామీ! ఎక్కువసేపు మెలుకువగా వుండడం, నావల్లకాదు. తమరు మహాశక్తి మంతులు కదా! నాకు కలలోకి వచ్చి పాఠాలు చెప్పండి,'' అని సాధువును కోరాడు కుంభన్న.

''అలాగే నీ కలలోకి వస్తాను. కానీ నువ్వు భోజనంకూడా కలలోనేచెయ్యాలి,తెలిసిందా?'' అన్నాడు సాధువు.

కుంభన్న సరేనన్నాడు. సాధువు, కుంభన్నకు కలలో కనిపించి పాఠాలు చెప్పాడు. కుంభన్న కలలోనే భోజనం చేశాడు. కానీ అందువల్ల వాడికి పాఠం అబ్బలేదు. కడుపు నిండలేదు. అలా నాలుగురోజులు గడిచాక, నీరసంతో కుంభన్నకు నిద్రపట్టలేదు. కాలక్షేపం కోసం వాడు ఊరంతా తిరిగాడు. అప్పుడు వాడికి ఊరెంతో అందంగా కనిపించింది. ఇక ఆగలేక బయట పూటకూళ్ళ ఇంట్లో భోజనం చేస్తే, ఆ తిండీ ఎంతో రుచిగా అనిపించింది.

''నా చుట్టూ ఇంత గొప్ప ప్రపంచముంటే, నేను దాన్ని చూడకుండా నిద్రపోతున్నాను. కళ్ళు మూసుకుంటే వచ్చే కలకంటే, కళ్ళు తెరిచినప్పుడు కనబడే నిజమే చాలా గొప్పది!'' అన్న విషయాన్ని తెలుసుకున్నట్టు వాడు, సాధువుకు చెప్పాడు.

''మనిషిపుట్టుక పుట్టినవాడు కలలు కనడానికి తక్కువ సమయాన్నీ, కలలు నిజం చేసుకోడానికి ఎక్కువ సమయాన్నీ వెచ్చించాలి. నిద్రలో కన్న కలలు మెలుకువలోనే నిజమవుతాయి కాబట్టి, మనిషి ఎక్కువసేపు మెలుకువగా వుండాలి. అయితే కృషి లేని మెలుకువ కూడా నిద్రవంటిదేకాబట్టి, ప్రతిమనిషీ అపారమైన కృషిచేసి పదిమందికీ మేలే చేయాలి!''అని సాధువు, కుంభన్నకు హితబోధ చేశాడు.

కుంభన్న ఆలోచనాధోరణి పూర్తిగా మారింది. వాడు క్రమంగా సకల శాస్త్రాలూ అభ్యసించి చాలా గొప్పవాడయ్యాడు. ఇప్పుడు తక్కువసేపు నిద్రపోతున్నా వాడికీనిద్ర పూర్వం కంటే ఎక్కువ సంతోషాన్నిస్తున్నది.



# కలలు కంటూన్న కొంగ!



తగిన అవకాశం కోసం ఎదురు చూస్తూన్నవాళ్ళను కొంగ జపం చేస్తూన్నట్టు చెప్పడం అలవాటు. పొడవాటి ముక్కు, వంకర మెడ, పుల్లల్లాంటి కాళ్ళు, తెల్లటి రంగు కారణంగా కొంగలు పిల్లల్ని బాగా ఆకర్షిస్తాయి. మనుషుల్లోలాగే, కొంగల మంచితనం, స్నేహం, మోసం, మొదలైనవాటిని తెలియజేసే కథలు కోకొల్లలుగా ఉన్నాయి.

ఒంటికాలి మీద కాదుగాని, రెండు కాళ్ళ మీద నిలబడి కలలు కంటూన్న కొంగబొమ్మను మీరే తయారుచేసుకోవచ్చు. ఇది మీ సృజనాత్మక శక్తికి పని కల్పించి, మనచేతుల తోనే చేసుకున్న బొమ్మ అనే తృప్తినిస్తుంది.



పక్క పేజీలో ఉన్న రేఖాచిత్రాన్ని అనుసరించి, అదనపు భాగాలను తొలగించి, కొంగరెక్కలు, తలతో కలిసిన ముక్కు, కళ్ళు, కుచ్చు, కాళ్ళు, పాదాలు విడివిడిగా కత్తిరించుకోవాలి.

మొదట పాదాలను వేరొక దళసరి కార్డుబోర్డు మీద అతికించి రంధ్రంతోసహా అలాగే కత్తిరించుకోవాలి. తరవాత రెండు దృఢమైన సన్నటి పుల్లలను తీసుకుని కాళ్ళకు సంబంధించిన భాగాలను వాటికి చుట్టి అతికించుకోవాలి. ఆరిన తరవాత కిందివైపున పాదాల రంధ్రాలలో దూర్చి, గట్టిగా అమర్చుకోవాలి.

ఆ తరవాత ముక్కుతోవున్న తలభాగాన్ని సరిగ్గా మడుచుకుని, రెండువైపులా రెక్కలను అతికించి, చిత్రంలో చూపిన విధంగా పుల్లల పైభాగంలో అమర్చుకోవాలి. ఆ పిమ్మట కళ్ళను గీతలున్నచోట మడిచి, ముక్కుకు పైభాగంలో తలమీద అతికించుకోవాలి. అదేవిధంగా దానికి వెనక కుచ్చును అతికించాలి. ఆహా! ఇప్పుడు మీ చేతులుమీదుగానే కలలు కంటూన్న కొంగబొమ్మ తయారయిందన్నమాట!





# శ్రమదానం

రామాపురం గ్రామంలో ఏనాటిదో అయిన రామాలయం జీర్ణావస్థలో వుండడంతో, ఒకసారివచ్చిన గాలివాన తాకిడికి బాగా దెబ్బతినిపోయింది. గ్రామపెద్దలు సమావేశమై, ఆలయాన్ని పూర్తిగా పునరుద్ధరించాలని నిర్ణయించారు.

ఆ సాయంత్రం గ్రామపెద్దల్లో నలుగురు కలిసి నారాయణయ్య ఇంటికి వెళ్ళి సంగతి సందర్భాలు చెప్పి, "ఈ ఆలయ పునర్నిర్మాణానికి అటూ ఇటూగా పదివేల రూపాయల అవసరం వుంటుందనుకుంటున్నాం," అన్నారు.

ఆ మాటలకు నారాయణయ్య చిరునవ్వు నవ్వి, "ఏ కాలంలోనో ఈ ప్రాంతాన్ని పాలించిన మహారాజు ఆలయ నిర్మాణానికి వేల వేల వరహాలు వ్యయంచేసి ఉంటాడు. ఇప్పుడు మనం అనుకునే పదివేలూ అంత పెద్ద మొత్తమేంకాదు. త్వరగా పని ప్రారంభించండి," అన్నాడు.

"ఈ ప్రోత్సాహం తమ నుంచి రావడం మహదానందంగా వున్నది!" అంటూ రమణయ్య అనే గ్రామపెద్ద మిగతావారి కేసి చూసి, నారాయణయ్యతో, "తమరు తమ సొంత వ్యవసాయంలోనే కాక, వ్యాపారం లాంటి వాటిల్లో కనబరిచే తెలివితేటలూ, కార్యదీక్షా గురించి, మన గ్రామంలోనే కాక ఇరుగుపొరుగు గ్రామాల్లో కూడా గొప్పగా చెప్పుకుంటారు. మీవంటివారు గ్రామంలో అందరికన్నా ఆస్తిపరులై వుండడం మాకెంతో గర్వకారణం," అన్నాడు.

"అయ్యా, రమణయ్యగారూ, నన్నంతగా పొగడకండి. నా తెలివితేటలూ, దక్షతా, ఆస్తిపాస్తులూ–అన్నీ ఆ శ్రీరాముడి కరుణాకటాక్షం వల్ల సమకూడినై!" అన్నాడు నారాయణయ్య రామాలయం దిశగా చేతులు జోడించి.

అప్పుడు గ్రామ పురోహితుడు కృష్ణశాస్త్రి కల్పించుకుని, "రాముడిపట్ల మీకున్న భక్తి బహుదా మెచ్చదగింది. పెద్దలందరూ నిర్ణ

ఆకెళ్ళ వెంకట సుబ్బలక్ష్మి

యించిన మేరకు ఆలయ పునరుద్ధరణకు గాను అయ్యే ఖర్చులో పదోవంతు తమరు చందాగా రామాలయ నిర్మాణానికి సమర్పించ గలరనుకుంటున్నాం," అన్నాడు.

ఆ మాట వింటూనే నారాయణయ్య ఉలిక్కిపడి, "అంటే వెయ్యి రూపాయలా!" అన్నాడు. వెంటనే గ్రామవైద్యుడు రంగాచారి కల్పించుకుని, "వెయ్యి రూపాయల మొత్తం, మీ స్థోమతుకు మించినదంటారా?" అని ప్రశ్నించాడు కాస్త కటువుగా.

ఆ ప్రశ్నకు నారాయణయ్య తెల్లబోయి, "క్షమించండి, ఆచారిగారూ. నేనలా అనుకో వడంలేదు. నాకు పుట్టుకతో వచ్చిన నమ్మకాలు కొన్ని వున్నవి. వాటిల్లో అతిముఖ్యమైనదే మంటే, స్నేహితులుగానీ, బంధువులుగానీ ఆఖరుకు దేవుడైనాసరే మనకు ఇచ్చిన బహుమానంలాంటిదాన్ని, కొన్నాళ్ళతర్వాత తిరిగి ఇవ్వజూపడం అనేది, వాళ్ళను అవ మానించడంతో సమానమని! ధనదానం కన్న శ్రమదానం ఉత్తమమైందని, మీకు తెలియంది కాదుగదా. నేనూ, మా పెద్దకొడుకూ ఆలయం పనులు పూర్తయ్యేదాకా రోజూ ఒక గంట పాటు శ్రమదానం చేస్తాం," అన్నాడు.

ఆ మాటలకు అందరూ ఫక్కుమంటూ నవ్వారు. అప్పుడు చిన్నబోయిన నారాయ ణయ్య మొహం చూసి రమణయ్య, "అయ్యా! మేమూ పదివేల రూపాయలూ పోగుచేసేం దుకు, ఒక పథకం ఆలోచించాం. అదేమంటే, దైవదర్శనానికిగాను, వాళ్ళవాళ్ళ స్థోమతును బట్టి డబ్బు చెల్లించడం. అందుగ్గాను వంద రూపాయల నుంచి ఒక్కరూపాయి వరకూ చీటీలు ఇచ్చే ఏర్పాట్లు చేస్తున్నాం. మీరు ఉదయం, సాయంకాలం కూడా దైవదర్శనా నికి వస్తూంటారు గదా!" అంటూ లేచాడు.

అతడితోపాటు మిగతా పెద్దలు కూడా లేచి నిలబడ్డారు. నారాయణయ్య చప్పున రమణయ్య చేతులు పట్టుకుని ఆపి, "నేను అలా గదిలోకి వెళ్ళివస్తాను!" అంటూ పోయి డబ్బు తెచ్చి రమణయ్య చేతిలో పెట్టాడు.

రమణయ్యతో పాటు మిగిలిన పెద్దలు కూడా నారాయణయ్యను అభినందించారు. తీరాబయలుదేరేప్పుడు గ్రామ పురోహితుడు, నారాయణయ్యతో, "చందా ఇచ్చారు సంతోషం. ఆ శ్రమదానం మాట మరవకండి," అన్నాడు.

దానికి గ్రామపెద్దలతో పాటు నారాయ ణయ్య కూడా పెద్దగా నవ్వాడు.






## గుమ్మడికాయ ఉపయోగం!



దక్షిణాదిలో ముఖ్యంగా తమిళనాడులో కొత్తగా కట్టే ప్రతి ఇంటి ముందూ అది పెద్దదయినా, చిన్నదయినా - పెద్ద గుమ్మడికాయను వేలాడదీయడం కనిపిస్తుంది. వట్టి గుమ్మడికాయే కాదు; మనల్ని చూస్తున్నట్టు దానిమీద భయంకరమైన రాక్షసుడి బొమ్మకూడా ఉంటుంది. ఇది మనల్ని భయపెట్టడానికి కాదు. చూసేవాళ్ళ 'కనుదిష్టి' ఆ ఇంటి మీద పడకుండా ఉండేందుకు. ఏమైనా కొత్తపనులు ప్రారంభించి పూజలు జరిపినప్పుడూ, నూతన వాహనాలను కొన్నప్పుడూ, నిమ్మకాయలతోపాటు గుమ్మడికాయలను దిష్టితీసి వీధుల్లో కొట్టడం ఇక్కడి అలవాటు. కొందరైతే ప్రతి అమావాస్యకూ గుమ్మడికాయలు కొడుతూ ఉంటారు.

## దుష్టుడా? దేవుడా?

మహాభారతంలోని దుర్యోధనుడి పాత్ర గురించి మీరేం అనుకుంటారు? మామూలుగా దుర్యోధనుడు అనగానే పాండవుల పట్ల విపరీతమైన అసూయా ద్వేషాలు కనబరచిన దురహంకారిగా, స్వార్థపరుడిగా, మంచి మాటలను పెడ చెవిని పెట్టిన దుర్మార్గుడిగానే కనిపిస్తాడు. అయితే, ఉత్తరకాశిలోని జమునా లోయలో నివసిస్తూన్న కొన్ని తెగల ప్రజలు ఈమాటను అంగీకరించరు. ఎందుకంటారా? మానధనుడైన దుర్యోధనుణ్ణి వాళ్ళు తమ దేవుడిగా పూజిస్తున్నారు!



# గోవా జానపద కథ

భారతదేశ పశ్చిమతీరంలో గోవా, డామన్, డయ్యు రాష్ట్రం ఉన్నది.

ఇక్కడ సహజసిద్ధంగా ఉన్న రేవు పోర్చు గీసుల సముద్ర వ్యాపారానికి అనుకూలంగా ఉండేది. 1961 వరకు ఇది పోర్చుగీసు అధీనంలో ఉండేది. గోవా కేంద్రపాలిత ప్రాంతంగా ఉంటూ 1987 మే 30 వ తేదీ రాష్ట్ర స్థాయిని సంతరించుకున్నది.

పడమటి కనుమలలోని సహ్యాద్రి పర్వత సానువుల మీద ఉన్న గోవాకు ఉత్తరంగా మహారాష్ట్ర; దక్షిణ, తూర్పు దిశలలో కర్నా టక; పడమటి దిశలో అరేబియా సముద్రం ఉన్నాయి.

గోవా జనాభా 13,43,998. దీని వైశాల్యం 3,702 చ.కీ.మీ. కొంకణి అధికార భాషగా ఉన్న గోవాలో పోర్చుగీస్, ఇంగ్లీష్, మరాఠీ భాషలు కూడా మాట్లాడతారు.

ఈ ప్రాంతానికి పూర్వం గోమంతకాచల, గోపకపట్టణ, గోవాపురి, గోవారాష్ట్ర అనే పేర్లలో ఏదో ఒకటి ఉండి ఉండవచ్చనీ, దానినే పోర్చుగీసులు గోవాగా పిలవసాగారనీ చెబుతారు. ఇక్కడ ప్రవహించే గోమతీనది కారణంగా ఈ ప్రదేశానికి గోమంతకాచల అనే పేరు ఏర్పడి ఉండవచ్చని చెబుతారు. గోమతీ నదిని ఇప్పుడు మండోవా నది అని పిలుస్తారు. ఈ రాష్ట్రంలో ప్రవహించే ప్రధాన మైన నది ఇదే.

## పాడే సింహం!

ఒకానొకప్పుడు గోమంతకాచల పట్టణంలో దూర దేశాలలో వ్యాపారం చేసే వర్తకుడు ఒకడు ఉండే వాడు. ఆయన ముగ్గురు కొడుకులూ ఆయనకు వ్యాపారంలో సాయపడేవారు. ఒకనాడు ఆయన పెద్దకొడుకు రుద్రేశుడు ఓడనిండా సరుకులతో వ్యాపారానికి బయలుదేరాడు.

కొన్నాళ్ళకు అతడొక అందమైన ద్వీపాన్ని చేరు కున్నాడు. ఆ ద్వీప తీరంలోని ఓడరేవులో కని పించిన ఒక ఫలకం మీది ప్రకటన అతని దృష్టిని ఆకర్షించింది: ''మన యువరాణి మాయాదేవి కొన్ని నెలలుగా కనిపించడంలేదు. ఒక వారంలోగా ఆమెను కనుగొని తెచ్చినవారు, ఆమెను వివాహం



చేసుకోవచ్చు. అయితే, ఆమెను వెతికి తెస్తానని మాట ఇచ్చి, తేలేకపోయినవారికి జైలుశిక్ష విధించి, వారి ఆస్తులను స్వాధీనపరచుకోవడం జరుగుతుంది.''

రుద్రేశుడు తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలని నిర్ణయించాడు.

అతడు రాజభవనానికివెళ్ళి,రాజును దర్శించి, ''ప్రభూ! నేను గోమంతకాచల పట్టణానికి చెందిన ఒక వర్తకుడి కుమారుణ్ణి. నా పేరు రుద్రేశుడు. వ్యాపార నిమిత్తం ఈ రోజే మీ ద్వీపానికి వచ్చాను. రేవు సమీపంలో మీరు పెట్టిన ప్రకటనను చూశాను. మీ కుమార్తెను కనుగొనగలననే నమ్మకం నాకున్నది. కనుగొనలేకపోతే మీరు నా ఓడనూ, అందులోని సరకులనూ స్వాధీనపరచుకోవచ్చు,'' అన్నాడు.

రాజు సరేనని అతనికి ద్వీపమంతా తిరగడానికి అనుమతినిచ్చాడు. రుద్రేశుడు భిక్షగాడి వేషంలో ద్వీపమంతా తిరిగి చూశాడు. అయినా, యువరాణి జాడ తెలియలేదు. ఒక వారం గడువు ముగిసిపోవడంతో రాజసైనికులు అతన్ని కారాగారంలో బంధించి, అతని ఓడను, సరుకులతో సహా స్వాధీనపరుచుకున్నారు.

కొన్ని నెలలు గడిచాయి. అక్కడ గోమంతకాచలంలో వర్తకుడు, వ్యాపార నిమిత్తం వెళ్ళిన కొడుకు తిరిగి రాకపోయేసరికి విచారగ్రస్తుడయ్యాడు. రెండవ కుమారుడు నాగేశుణ్ణి పిలిచి, ''రుద్రేశుడి వ్యాపారంలో ఏదో అవాంతరం వచ్చి ఉంటుంది. నువ్వు మరొక ఓడలో సరుకులు తీసుకుని మీ అన్న వెళ్ళిన మార్గానే వెళ్ళు. వ్యాపారం చేస్తూనే మీ అన్న ఆచూకీ కూడా తెలుసుకోవచ్చు,'' అన్నాడు.

నాగేశుడు ఓడతో బయలుదేరాడు. కొన్నాళ్ళకు అతడూ, అన్న వెళ్ళిన ద్వీపాన్ని చేరుకున్నాడు. అక్కడి రేవులోని శిలాఫలకాన్ని చూశాడు. తనూ అదృష్టాన్ని పరీక్షించుకోవాలని రాజు దగ్గరికి వెళ్ళి



అనుమతి కోరాడు. రాజు సరేనన్నాడు. అతడు జ్యోతిష్కుడి వేషంలో రాకుమారి మాయాదేవిని వెతకడానికి పూనుకున్నాడు. ప్రజల భవిష్యత్తును చెప్పగలనన్న నెపంతో ద్వీపంలోని ఇల్లిల్లూ తిరిగాడు. ఒక వారం దాటిపోయింది తప్ప అతడు యువరాణిని కనుగొనలేకపోయాడు. అతడూ

## హస్తకళలు

భారతీయ, పోర్చుగీసు సంస్కృతుల విలక్షణమైన సమ్మేళనాన్ని గోవా సంస్కృతి తెలియజేస్తుంది. ఇక్కడి హస్తకళలు దీనిని స్పష్టంగా ప్రతిబింబిస్తాయి. నార, పేము టోపీలు, వెదురుతో తయారుచేసే వస్తువులు, కుండలు, కొయ్యమీద చెక్కడపు పనులు, గవ్వల వస్తువులు, ఖోన్ చాపలు మొదలైనవి గోవా హస్తకళలో ముఖ్యమైనవి. అల్లికలు, ఎంబ్రాయిడరీ, అద్దకం పనులు, గుడ్డబొమ్మలు మొదలైనవి కూడా ఇక్కడ చాలా ప్రసిద్ధమైనవి.

జైలుపాలయ్యాడు. ఓడ రాజు వశమయింది.

వెళ్ళిన ఇద్దరు కొడుకుల కోసం వర్తకుడికి బెంగ పట్టుకున్నది. వాళ్ళను వెతుక్కుంటూ తనే వెళ్ళా లనే నిర్ణయంతో ప్రయాణ సన్నాహాలు చేయ సాగాడు. ఆ సంగతి తెలిసిన ఆయన మూడవ కొడుకు మంగేశుడు తండ్రిని వారించి, "నాన్నా మీకు వయోభారం పైబడుతున్నది. సుదూర ప్రయాణం తట్టుకునే శక్తి మీకు సన్నగిల్లింది. నేనే వెళ్ళి అన్నలను వెంటబెట్టుకు వస్తాను," అన్నాడు.

తండ్రి అందుకు అంగీకరించాడు.

మంగేశుడు ఓడలో ప్రయాణమై అన్నలు వెళ్ళిన మార్గంలోనే వెళ్ళి, వాళ్ళు చేరుకున్న ద్వీపాన్ని సమీపించి, రేవు సమీపంలో ఉన్న ప్రక టనాఫలకాన్ని చూశాడు. అన్నలిద్దరూ ఆ ప్రక టనను చూసి, యువరాణిని కనుగొనే ప్రయ త్నంలో జైలుపాలై ఉంటారని గ్రహించాడు.

అతడు నగరంలోకివెళ్ళి, తన అన్నల గురించి వర్తకుల వద్ద విచారించాడు. ఎవరూ చూడలేదన్నారు. ఆఖరికి అతను రాజుగారి ఉద్యానవనంలో చెట్లకు నీళ్ళు పడుతూన్న ఒక మధ్యవయస్కురాలి దగ్గ రికి వెళ్ళాడు. ఆమె అతన్ని కొంతసేపు పరిశీలనగా చూసి, "నిన్ను పోలిన ఇద్దరు యువకులు యువరాణిని వెతికి తెస్తామని చెప్పి వెళ్ళారు. అయితే, వాళ్ళు ఆ పనిని సాధించలేక జైలుపాలయ్యారు. వాళ్ళ ఓడలను రాజుగారు వశపరచుకున్నారు," అన్నది.

"వాళ్ళిద్దరూ నా అన్నలే. వాళ్ళనెలా గైనా జైలు నుంచి విడిపించాలి. యువ రాణి ఎక్కడున్నదో తెలుసుకుని, ఆమెను వివాహమాడాలని కూడా ఉంది. ఈవిష యంలో నీసాయంకావాలి. చేయగలవా?" అని అడిగాడు మంగేశుడు.

"యువరాణి ఎక్కడుందో నాకు తెలిసివుంటే, ఆ సంగతి నా కొడుక్కు చెప్పి, ఆమెను నా కోడలిని చేసుకునేదాన్ని కదా నాయనా? అయితే, ఒకటి మాత్రం రూఢిగా చెప్పగలను. రాజభవనంలో ప్రవేశించి యువరాణిని వెతకడం ఒక్కటే ఆమెను కనుగొనడానికి సరైన మార్గం. అయితే, రాజభవనంలో ప్రవేశించడం చాలాకష్టం. పిట్టకూడా లోపలికి వెళ్ళజాలదు," అన్నది ఆమె.

"అమ్మా! నువ్వు చాలా తెలివైనదానివి. దయ చేసి నువ్వే ఎలాగైనా ఈ విషయంలో సాయ పడాలి!" అన్నాడు మంగేశుడు.

ఆమె కొంతసేపు ఆలోచించింది. ఆ తరవాత తన యోచనను మెల్లగా మంగేశుడికి చెప్పింది. దాన్ని వినగానే మంగేశుడి ముఖం ఆనందంతో వెలిగిపోయింది. "అలాగే చేద్దాం. చాలా కృత జ్ఞతలు!"అన్నాడు. ఆమె మంగేశుణ్ణి స్వర్ణకారుడి దగ్గరికి వెళ్ళి, బంగారంతో బోలుగా ఉన్న పెద్ద



సింహంబొమ్మను తయారుచేయించమన్నది. బొమ్మ సిద్ధంకాగానే, ఆమె దానిని రాజభవనానికి తరలించుకుని వెళ్ళి రాజు ముందుంచి, "మహా ప్రభూ! ఈ బంగారు సింహం చక్కగా పాడగలదు. తమకోసం దానిచేత పాడించమన్నారా?" అని అడిగింది.

"సింహంబొమ్మ పాట పాడుతుందా? ఏదీ పాడించు చూద్దాం!" అన్నాడు రాజు.

ఆమె సింహంకేసి తిరిగి, "మృగరాజా! ఏదీ రాజుగారికి ఒక పాట పాడి వినిపించు!" అన్నది.

మరుక్షణమే సింహం బొమ్మ నుంచి మధుర గంభీరస్వరంతో ఒక పాట వినిపించింది.

దానిని విన్న రాజు పరమానందంచెంది, "ఆహా! అద్భుతం!" అని ఆ స్త్రీకేసి తిరిగి, "దీనికి ఎంత ధనం కావాలో చెప్పు," అన్నాడు.

"క్షమించాలి ప్రభూ! ఈ సింహం అమ్మకానికికాదు. ఇది ఒక పరదేశీయుడిది. ఆయన మా ఇంట్లో బసచేసి ఉన్నాడు. రేపే వాళ్ళ రాజ్యానికి బయలుదేరుతున్నాడు. వింతగా ఉందికదా అని తమకు చూపుదామని తీసుకువచ్చాను, అంతే!" అన్నది ఆమె.

"అలాగా! అయితే ఈ పూటకు దీన్ని ఇక్కడే ఉంచి వెళ్ళు. దానిని రాణికి చూపించి రేపు నీకు ఇస్తాను,"అన్నాడు రాజు.

"చిత్తం, ప్రభూ!" అంటూ ఆమె అక్కడి నుంచి వెళ్ళింది.

రాజు దానిని నౌకర్ల సాయంతో రాణి దగ్గరికి తీసుకెళ్ళి చూపాడు. "ఆహా! అద్భుతం ఈ పాట పాడే సింహాన్ని మాయాకు చూపుదాం." అన్నది రాణి ఉత్సాహంతో.

"అవును. దీనిని చూసిందంటే ఆమె ఎంతగానో సంతోషిస్తుంది," అని రాజు తల పంకించాడు.

ఆ తరవాత ఆయన సింహం బొమ్మను తన గదిలోకి తీసుకుపోయి నిలబెట్టి, నేలమీద పరచి ఉన్న తివాసీని తొలగించి, అడుగున ఉన్న పలకను



పైకెత్తాడు. అక్కడ ఉన్న మెట్లగుండా కిందికి దిగి వెళ్ళి విశాలమైన నేలమాళిగను చేరాడు. అక్కడి చివరి గదిలో ఒకే రూపంతో ఉన్న పదిమంది యువతులు కనిపించారు. రాజు వారిలో ఒకరిని మాయా అంటూ ఆప్యాయంగా పలకరించాడు.

"నాన్నా, ఇంకా ఎన్నాళ్ళీ నేలమాళిగవాసం? మహాకష్టంగా ఉంది," అన్నది యువరాణి మాయదేవి.

"ఇంకా కొంతకాలం ఓపికపట్టు తల్లీ! అసలు నేను నిన్నిక్కడ ఎందుకు దాచానో తెలుసా? మన ఖజానా ఖాళీ అయిపోయింది. విదేశాల నుంచి వర్తకుల ఓడలను స్వాధీనపరచుకోవడం తప్ప, దాన్ని నింపడానికి నాకు మరొకమార్గం కనిపించ లేదు. అందుకే ఈ ఉపాయం పన్నాను. మరి కొన్నాళ్ళు ఓర్పు వహించు," అన్నాడు రాజు కుమార్తెను బుజ్జగిస్తూ.

యువరాణి సరేనన్నట్టు మౌనం వహించింది. అప్పుడు రాజు, "చూడు, నీకు ఎలాంటి కానుక తెచ్చానో," అన్నాడు సింహాన్ని చూపుతూ.

యువరాణీ, ఆమె చెలికత్తెలూ పాడే సింహాన్ని చూసి అమితానందం చెందారు. రాత్రికి దానిని అక్కడే ఉంచమని యువరాణి తండ్రిని వేడు కున్నది. రాజు సరేనని వెళ్ళిపోయాడు.

రాత్రి సింహం బొమ్మతో శయ్యామందిరానికి చేరిన యువరాణి, "సింహమా! నువ్వు నాకోసం శోకగీతం ఆలాపించగలవా?" అని అడిగింది. వెంటనే సింహం ఒక శోకభరితమైన ప్రేమగీతం పాడి వినిపించింది. ఆ పాట విని తన్మయం చెందిన యువరాణి, "నువ్వేగనక ఒక యువకుడివైతే, నిన్ను నేను వివాహమాడి ఉండేదాన్ని," అన్నది.

"నేనొక వింతమృగాన్ని. నా పాదాల అడుగున ఉన్న గొలుసును లాగినట్టయితే, నేను మనిషిగా మారిపోగలను," అన్నది సింహం మానవ కంఠ స్వరంతో.

మాయా అమితాశ్చర్యంతో, సింహం పాదం దగ్గిరున్న గొలుసును పట్టి బలంగా లాగింది. వెంటనే లోపలివైపున ఉన్న తలుపు తెరుచు కున్నది. అందులో నుంచి మంగేశుడు వెలుపలికి వచ్చి తనను పరిచయం చేసుకుని, "నిన్ను నేను వివాహమాడాలనుకుంటున్నాను. అందుకే ఇలా వచ్చాను," అన్నాడు.

మాయా సిగ్గుతో, ఆనందంతో ఉబ్బి తబ్బి బ్బయిపోయింది. ఆ రాత్రంతా ఏం చేయాలో ఇద్దరూ ఆలోచించారు. ఒకే రూపు రేఖలతో ఉన్న చెలికత్తెల నుంచి మాయాదేవిని ఎలాకనుగొనాలో మంగేశుడు తెలుసుకున్నాడు. ఆమె పైపెదవిపైన పుట్టుమచ్చ, మిగతావారికన్నా కాస్త పెద్దదిగానూ, ఉబ్బెత్తుగానూ ఉన్నది. చెలికత్తెలకు ఆ మచ్చ పెట్ట బడిందిగనక మామూలుగా కనిపిస్తుంది. తెల్ల వారగానే మంగేశుడు మళ్ళీ సింహంబొమ్మ లోప లికి వెళ్ళిపోయాడు. రాజాజ్ఞ ప్రకారం దానిని భటులు తోటమాలి స్త్రీకి అప్పగించారు.

ఆ తరవాత మంగేశుడు రాజును దర్శించి, "మహారాజా, నేను గోమంతకాచల రాజ్యానికి చెందిన ఒక వర్తకుడి కుమారుణ్ణి. మీ కుమార్తెను వెదకడానికి అనుమతికోరి వచ్చాను," అన్నాడు.

రాజు అనుమతించాడు. ఆయనకు అను మానం రాకుండా ఉండేందుకు మంగేశుడు ఆరు రోజుల పాటు ద్వీపమంతా వెతికాడు. ఏడవ రోజున రాజు దగ్గరికి వెళ్ళి, "ద్వీపమంతా గాలించి చూశాను. యువరాణి జాడ తెలియలేదు. రాజ భవనం ఒక్కటే మిగిలింది. అక్కడా వెతుకుతాను. తమ అనుమతి కావాలి," అన్నాడు.

ఆ మాట విని రాజు గతుక్కుమన్నాడు. ఒక్క క్షణం నోట మాట రాలేదు. ఆ తరవాత తేరుకుని, "సరే, అలాగే కానివ్వు!" అన్నాడు.

## జానపద నృత్యాలు



గోవా జానపద నృత్యాలు అక్కడ నెలకొన్న వివిధ సంస్కృతీ, సంప్రదాయ కళారూపాలను ప్రతిబింబించేవిగా ఉన్నాయి. 'ఫుగ్డీ' సుప్రసిద్ధ మైన జానపద నృత్యం. దీనిని స్త్రీలు మాత్రమే ప్రదర్శిస్తారు. ముఖ్యమైన సభలు సమావేశా లలో ఈ నాట్యప్రదర్శన ఉంటుంది. స్త్రీలు మాత్రమే ప్రదర్శించే మరొక జానపద నృత్యం 'ధాలో'. లయబద్ధమైన అద్భుత పద విన్యాసా లకు ప్రసిద్ధిగాంచిన 'కొరెక్ దిన్‌హో' పోర్చు గీసు నుంచి వచ్చిన జానపద నృత్యం. ఘోడ్ మోదిని, గోఫ్, కున్బి, రొమాట్ మొదలైనవి మరికొన్ని సుప్రసిద్ధ జానపద కళారూపాలు.

మంగేశుడు ముందుగా భవనమంతా తిరిగి చూశాడు. రాజమందిరంలోకి వెళ్ళి నేలనంతా పరిశీలనగా చూశాడు. ఒకచోట తివాసీని తొలగించి, పలకను పైకెత్తి మెట్లగుండా కిందికి దిగి వెళ్ళాడు.

రాజుకు దిక్కుతోచలేదు. చేసేదిలేక మౌనంగా అతని వెంట నడిచాడు. మంగేశుడు నేలమాళిగ లోని యువరాణి మందిరానికి వెళ్ళి పదిమంది యువతులను చూపుతూ, "వీరిలో ఒకరు తమ కుమార్తె!" అన్నాడు.

"నువ్వు ఆమెను గుర్తించగలిగితే, చూపించు మరి!" అన్నాడు రాజు. తను చూసిన యువకు లందరిలోకీ ఇతడు తెలివైనవాడని రాజు గ్రహిం చాడు. మంగేశుడు యువతులందరినీ ఒకసారి పరిశీలనగా చూశాడు. మిగిలినవారికన్నా మాయా దేవి పెదవిమీది పుట్టుమచ్చ విలక్షణమైనదని అతనికి తెలుసు. దానిని పరిశీలించి చూసి, ఆమె దగ్గరికి వెళ్ళి వంగి నమస్కరించి రాజుకేసి తిరిగి, "ప్రభూ! ఈమే తమ కుమార్తె!" అన్నాడు.

"నువ్వు చాలా తెలివైనవాడివి. ధైర్యశాలివి.



## వంట సరంజామా

మసాలా వాసన ద్రవ్యాలకూ, గోవాకూ విడ దీయరాని సంబంధం ఉంది. గోవా వంటకం దక్షిణాది - నవాబు వంటకాల మిశ్రమం గనక, ఇందులో మసాలా దినుసులపాలు ఎక్కువ సంప్రదాయ గోవా వంటకాలకు ఆ తరవాత పోర్చుగీసు తాజా వాసనలు కూడా వచ్చి చేరాయి. సముద్రతీర రాష్ట్రం కావడంతో, మసాలా పట్టించిన చేపలు, రొయ్యలు మొదలైన వంటకాలు ఇక్కడ చాలా ప్రసిద్ధమైనవి. స్థానికంగా జీడిమామిడి గింజలు లేదా కొబ్బరి నుంచి 'ఫెనీ' అనే ఒక విధమైన మద్యాన్ని తయారు చేస్తారు.

నా కుమార్తెకు తగిన వరుడివి!" అన్నాడు రాజు ఆనందాశ్చర్యాలతో.

మంగేశుడు పరమానందం చెంది, "ప్రభూ! తమ నిర్ణయానికి చాలా సంతోషం! అయినా ఒక చిన్న విన్నపం," అన్నాడు.

"ఏమిటి?" అని అడిగాడు రాజు.

"మాయాదేవిని వెతకగలమని వచ్చి, జైలు పాలైన యువకులందరినీ విడుదల చేయండి," అన్నాడు మంగేశుడు.

"అలాగే!" అన్న రాజు, అప్పటికప్పుడే వాళ్ళ విడుదలకు ఆజ్ఞలు జారీచేశాడు. అలా విడు దలైనవారిలో రుద్రేశుడూ, నాగేశుడూ కూడా ఉన్నారు. తమ్ముడు చేసిన సాహసం గురించి విని వాళ్ళు ఆనందంతో ఉప్పొంగిపోయారు.

రాజుకు మాత్రం, మంగేశుడు తన కుమార్తె ఉన్న చోటును ఎలా కనుగొనగలిగాడా అన్న అనుమానం తీరనేలేదు!

మంగేశుడు యువరాణి మాయాదేవిని వివాహ మాడి, ఆమెను వెంటబెట్టుకుని, అన్నలతో కలిసి తమ రాజ్యానికి తిరుగుప్రయాణమయ్యాడు.

# ఉత్తర ధ్రువంలో భారతీయ మహిళ!

కేరళ రాష్ట్రానికి చెందిన రాచెల్ థామస్ అనే నలభై ఆరేళ్ళ మహిళా 'స్కై-డైవర్' ఉత్తర ధ్రువంలో కాలుమోపిన తొలి మహిళగా పేరు తెచ్చుకున్నది. ఆమె గతఏప్రిల్‌మాసంలో చారిత్రాత్మకమైన ఈ సాహసం చేసింది. మైనస్ 50 డిగ్రీల సెల్షియస్ ఉష్ణోగ్రతలో ఆమె 1000 అడుగుల ఎత్తునుంచి కిందికి ఉరికింది. ఆమెను కనుగొనేంత వరకూ ఆమె పచ్చి చేపలనూ, మంచు జింక మాంసాన్నీ తింటూ ప్రాణాలను నిలబెట్టుకున్నది. శ్రీమతి రాచెల్ థామస్ కూతురు అనీ ఒకప్పుడు మిస్ ఇండియాగా పేరుగాంచింది. శ్రీమతి థామస్ గత 25 సంవత్సరాలుగా 'స్కై-డైవింగ్' చేస్తోంది.




# పెద్ద తాళం కప్ప

పూరీలో యేటా జరిగే జగన్నాథ రథయాత్ర జగత్ప్రసిద్ధమైనది. ఇటీవలజగన్నాథమందిర ప్రధాన ద్వారానికి కొత్తగా ఒక తాళం కప్పను తయారుచేశారు. ఆ తాళం ఎత్తు 2 అడుగులు; వెడల్పు 1 అడుగు. బరువెంతో తెలుసా? 50 కి. గ్రా. 30,000 రూ. ధర కలిగిన ఈ తాళం తయారుచేయ డానికి దాదాపు మూడు నెలలు పట్టింది. తాళం తెరవ డానికి ఉపయోగించే ఇత్తడి చెవుల పొడవు 30 సె. మీ. అంటే ఇంచుమించు 15 అంగుళాలు. అయితే ఇంత పెద్ద తాళం, చేయడం ఆ తాళాల తయారీకంపెనీకి కొత్తేం కాదు. ఈ తాళం కూడా అతి పెద్దదేం కాదు. ఎందుకంటే 1961వ సం.లో ఢిల్లీలో జరిగిన 'వరల్డ్ ట్రేడ్‌ఫేర్' కోసం ఆ కంపెనీ 60 కి.గ్రా. బరువుగలతాళాన్ని తయారుచేసింది.





# విఘ్నేశ్వరుడు

గణాధిపత్య పట్టాభిషేకానికి పార్వతి ధగధగ మెరిసే రంగుబట్టల్ని ఎన్నికచేసింది. కాని, విఘ్నేశ్వరుడు తెల్లని వస్త్రాలు ధరించాడు.

''మంచిబట్టలు వేసుకోవలసిన సమయంలో శుక్లాంబరధరుడు అనిపించుకున్నావేమయ్యా?'' అన్నది పార్వతి.

''మంచి బట్టలు కదమ్మా వేసుకోవాలి? అవే వేసుకున్నానమ్మా. తెలుపు మంచితనాన్ని, వివేకాన్ని తెలుపుతుంది!'' అన్నాడు విఘ్నేశ్వరుడు.

పట్టాభిషేకం జరిగింది. విఘ్నేశ్వరుడు గణనాథుడు అయ్యాడు. జయలక్ష్మి పేరుగల సిద్ధి, విద్యావతి పేరుగల బుద్ధి విఘ్నేశ్వరుణ్ణి వరించి ఇరుపక్కలా చేరారు. గణనాథుడు సిద్ధి బుద్ధి వినాయకుడు అనిపించుకున్నాడు. అదే సమయంలో ఎనిమిది దిక్కుల నుండి అష్టసిద్ధులు ఎనమండుగురు చక్కని కన్యలై వచ్చి వకుళమాలలు వేసి, వినాయకుణ్ణి వరించారు. విఘ్నేశ్వరుడు సిద్ధివినాయకుడు అనిపించుకున్నాడు. కళ్యాణమహోత్సవాలు వైభవంగా జరిగాయి.

విష్ణువు విఘ్నేశ్వరుడితో, ''కోటి విఘ్నాలు వచ్చినా వినాయకుడి పెళ్ళి ఆగదు! అనే కొత్త సామెత అమలుజరిగింది. ఓ కళ్యాణగణేశా! ఇక నీ చేతిమీదుగా కళ్యాణాలు జరగాలి. అలా జరిగిన కళ్యాణ ఫలంగా అవతరించిన జన్మే జన్మ!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''అలాగే జరుగుతుందిలే. కౌసల్యకు రాముడివై అవతరించి రావణదశ అంతం చేద్దువుగాని!'' అని అన్నాడు.

మళ్ళీ విష్ణువు, ''గజాననా! నీ ప్రసన్న వదనం చూస్తుంటే ఏనుగ అంటే చెప్పలేనంత



మక్కువగా ఉందోయి!'' అన్నాడు మందహాసం చేస్తూ.

విఘ్నేశ్వరుడు, ''మొసలిబారి నుండి గజేంద్రుణ్ణి రక్షించి కరివరదుడు అనిపించుకుందువులే!''అన్నాడు.

ఎనమండుగురు సిద్ధి కన్యలు చామర వింజామరాలు వీస్తూండగా, సింహాసనంపై సిద్ధి బుద్ధులతో చుక్కల్లో చంద్రుడిలాగ విఘ్నేశ్వరుడు ప్రకాశిస్తున్న ఆ సమయంలో, లక్ష్మి ముఖం తిప్పుకొని వెళ్ళిపోబోతూంటే విష్ణువు ఆమెను ఆపి, విఘ్నేశ్వరుడితో, ''సిద్ధి వినాయకా! లక్ష్మి స్థిరమైనది కాదు అని వాదు పడుతున్నది. నీ ఒడిలో కాస్త కూర్చుండనియ్యి! లక్ష్మికి స్థిరత్వం సిద్ధిస్తుందని ఆశిస్తున్నాను!'' అని అన్నాడు.

విఘ్నేశ్వరుడు మహానందంతో, ''తల్లి మహాలక్ష్మిని ఒడిపట్టే నా అదృష్టం ఎంత గొప్పది!'' అని అంటూ లక్ష్మి పాదాలను తొండంతో చుట్టి తన కుడి తొడమీద కూర్చుండబెట్టుకున్నాడు.

అప్పుడు విష్ణువు, ''ఇప్పుడు విఘ్నేశ్వరుడు 'లక్ష్మీగణపతి'. తల్లి కుమారుణ్ణి ఏవిధంగా కనిపెట్టుకొని ఉంటుందో అలాగే విఘ్నేశ్వరుడి అనుగ్రహం ఉన్నచోట లక్ష్మి స్థిరంగా ఉంటుంది,'' అని చెప్పాడు.

నారదుడు, '' ఓహో, విఘ్నేశ్వరుడికి ఎన్ని పేర్లు! సిద్ధివినాయకుడు, లక్ష్మీగణపతి, శుక్లాంబరధరుడు - ఇంకా ఎన్నో ఎన్నో,'' అని అంటూ మహతివీణను వాయిస్తూ, ''జయ జయ జనగణనాయక జయహే!'' అని గానం చేస్తూ లోకాలన్నీ తిరిగాడు.

ఒకనాడు విఘ్నేశ్వరుడు ఎలుక వాహనంపైన ఆకాశమార్గంలో పయనిస్తూ వింధ్య పర్వతశ్రేణిని దాటి, ఇంకా దక్షిణంగా వెళ్ళి ఒక పెద్ద నల్లని కొండదగ్గిర దిగాడు. కొండ దిగువనే శబరులు డోళ్ళు, డప్పులు కోలాహలంగా వాయిస్తూ పెద్ద సంబరం జరుపుకుంటున్నారు.

విఘ్నేశ్వరుడు తన రూపాన్ని ఉపసంహరించుకుని అందమైన కుర్రవాడి రూపంతో ఉత్సవాన్ని సమీపించాడు.

శబరులు కుర్రవాణ్ణి చుట్టుముట్టి, ''దేవర తనకోసం మంచి చిన్నోడిని పంపినాడు!'' అంటూ ఎత్తుకుపోయి ఉత్సవం మధ్యలో దింపారు.

అక్కడ రక్తపు చారలతో పెద్ద నల్లని గండశిల ఉన్నది. ఎదురుగా ఒకపసివాడు మూగగా ఏడుస్తూ ఉన్నాడు. ఆ పిల్లవాడి ఒంటినిండా పసుపు రాసి, మొలకు నల్లని గుడ్డ కట్టి,

ఎర్రని మందార మాలతో అలంకరించారు. విఘ్నేశ్వరుడు శబరనాయకుడితో, ''మీ దేవరతో నేను మాట్లాడాలి, నన్ను అతని దగ్గ రికి తీసుకెళ్ళండి!'' అన్నాడు.

శబరనాయకుడు పకపకా నవ్వుతూ, ''బలే చిన్నోడివే! మా స్వామితోనే మాటలాడ తావా? మా స్వామి కారుచీకటిలాగ మహా భీకరంగా ఉంటాడు. ఎవరూ చూళ్ళేరు. చూస్తే రక్తం కక్కుకొని అలాగే చచ్చిపోతారు!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు నవ్వి, తటాలున వెళ్ళి గండశిలను సమీపించి, ''మీ భయాన్నే మీ స్వామికి అంటగట్టి భయంకరంగా ఉంటా డని అనుకుంటున్నారు. భయాన్నే భక్తిఅంటు న్నారు. మీలో ఉండే క్రూరస్వభావమే బలిగా తయారైంది. ఇదంతా తప్పు! మీరెవ్వరూ మీ స్వామిని చూసి ఎరగరు. మీ స్వామి ఎన్నడూ ఇలాంటి ఉత్సవాల్నీ, బలినీ కోరలేదు. మీ స్వామి ఎంతో అందంగా ఇలాగ ఉంటాడు,'' అని చెబుతూ అరచేత్తో రాతిని తట్టాడు. నల్లని బండరాయి తెల్లని అరటిదవ్వలాంటి అందమైన స్వామి విగ్రహంగా మారింది. మోకాళ్ళపై చేతులు చాచి కూర్చున్న స్వామి విగ్రహం నవ్వు ముఖంతో మనో హరంగా కనిపించింది. విఘ్నేశ్వరుడు పసి వాడి తల నిమిరాడు.

ఆ పిల్లవాడు గొంతెత్తి, ''స్వామీ, నీవే శరణం!'' అంటూ విగ్రహంముందు మోక రిల్లి స్తోత్రం మొదలుపెట్టాడు.

నల్లరాయి స్వామివిగ్రహంగామారడమూ, మూగపిల్లవాడు గొంతెత్తి మాటలు పలక డమూ రెప్పపాటున జరిగాయి.



అద్భుతాలకు శబరులు నివ్వెరపాటుతో చేతులెత్తి, భయం భయంగా విఘ్నేశ్వరుడికి మొక్కారు.

కుర్రవాడి రూపంతో ఉన్న విఘ్నేశ్వరుడు వారిస్తూ, ''నన్నుకాదు మీరు మొక్కవల సింది. మీ స్వామిని భయాన్ని విడిచి ప్రేమతో కొలవండి; మీరు నమ్మిన దేవరను తండ్రి లాగ, అన్నలాగ, స్నేహితుడిలాగ చూసుకోండి. బలులు మొదలైన చెడ్డపనులు మానేసి ఫలపుష్పాలతో, అరటి తోరణాలతో ఆనం దంగా పండగలు చేసుకోండి. ఈ మాటలు వచ్చిన పిల్లవాడే మీకు గురువుగా, స్వామి పూజారిగా ఉంటాడు. నేను మీ స్వామిని చూసి మాట్లాడడానికి ఆయన దగ్గరకు వెళ్తున్నాను. త్వరలో మీ స్వామి మీకు దర్శన మిస్తాడు!'' అని చెప్పి చరచరా కొండను ఎక్కుతూ వెళ్ళాడు.



శబరులు కొంతవరకు అతనిని అనుస రించి వెళ్ళి ఆగిపోయారు.

విఘ్నేశ్వరుడు కుర్రవాని రూపంతోనే పర్వతాగ్రానికి చేరాడు. అక్కడ భైరవస్వామి తల వాల్చుకుని విచారంగా కూర్చుని ఉన్నాడు. అతని శరీరం కారునల్లగా ఉన్నది.

విఘ్నేశ్వరుడు పరుగున వెళ్ళి భైరవుణ్ణి రెండు చేతులా చుట్టి ఆలింగనం చేసుకున్న క్షణంలోనే భైరవుడి శరీరం తెల్లగా వెన్నెల కాంతితో ప్రకాశించింది.

దివ్యమంగళ రూపాన్ని పొందిన భైరవుడు కుర్రవాణ్ణి ఆనందంతో కౌగలించుకుని, ''నీవు విఘ్నేశ్వరుడివి! నాకు తెలుసు, నీ అనుగ్రహంతో కారుదనం పోయి దైవత్వం సిద్ధిస్తుందని. నేను అవతరించినప్పుడు ఆకాశవాణి చెప్పింది. ఈ కొండ ఎక్కడానికి ఎవ్వరూ సాహసించరు. నన్ను చూసి పక్షులు కూడా ధ్వని చెయ్యవు. నన్ను నేనే అసహ్యించు కుంటూ నీ కోసం ఎంతకాలం నుంచో నిరీ క్షిస్తూ ఉన్నాను. నీ నిజరూపంతో నా కన్ను లకు విందు చెయ్యి!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు నిజరూపాన్ని పొంది అత నితో, ''ఇకనుండి నీవు దైవంగా ఆరాధింప బడేస్వామివి! శివకేశవులిద్దరూ నీలో ఉన్నారు. నీ గురించి అమ్మ చెప్పినప్పట్నించి నిన్ను కలు సుకోవాలని తహతహపడుతూనే ఉన్నాను. మోహం చీకటిలాంటిది! శివుడు మోహపరవ శుడై జగన్మోహినీ రూపం ధరించిన విష్ణువు వెంటబడ్డాడు. శివ, విష్ణువుల తేజస్సులు ఒక టిగా కలసి నీ అవతరణం జరిగింది. అందు వలన నీకు నల్లనిరూపు వచ్చింది. ఇప్పుడు నీ అంత దివ్యమంగళ సుందరుడైన స్వామి మరొకడు లేడు! శబరులకు ఒకసారి కని పించు!'' అన్నాడు.

తరువాత విఘ్నేశ్వరుడు కుర్రవాని రూపంతో శబరుల దగ్గరికి వచ్చి, ''మీ స్వామి విగ్రహం ముందు మోకరిల్లి ఏక కంఠంతో 'స్వామీ! శరణం!' అని పిలవండి. మీ స్వామి మీకు కనిపిస్తాడు! పిలిచినప్పుడల్లా పలుకుతాడు. పంటలు పండించండి, వెళ్ళండి!'' అని చెప్పి అదృశ్యమయ్యాడు.

శబరులు నివ్వెరపోయి దణ్ణాలు పెట్టి, విగ్రహం దగ్గరకు చేరుకుని స్వామిని నోరారా పిలుస్తూ మ్రొక్కారు. దివ్యసుందర రూపంతో స్వామి వారికి సాక్షాత్కరించి చిరునవ్వులతో అభయముద్ర పట్టి వారిని ఆశీర్వదించి అంత ర్థానమయ్యాడు. అప్పటినుంచి శబరులు ఏటేటా మార్గశిరమాసంలో అరటిచెట్టు




బోదెను, లేత ఆకును అనేకవిధాలుగా ఉపయోగించి స్వామికి మంటపాలనూ, పందిళ్ళనూ అలంకరణ చేసి, బలులు మొదలైనవి మాని సాత్వికారాధనతో స్వామిని భయంలేని భక్తితో అర్థిస్తూ, నాగరికులై విద్యావంతులై ఉన్నత మానవత్వాన్ని సాధించారు. స్వామి నివసించిన కొండపై గొప్ప ఆలయాన్ని శిల్పకళా నిలయంగా నిర్మించి సంగీత నృత్య కవితలతో అలరించి గర్వించదగ్గ మానవజాతిగా రూపొందారు.

కుర్రవాని రూపంలో వచ్చినదెవరో శబరులకు తెలియదు, వారి దేవరస్వామియే ఆ రూపంలో వచ్చి తమ అజ్ఞానాన్ని తొలిగించి అనుగ్రహించాడని అనుకున్నారేగాని విఘ్నేశ్వరుని లీల అని ఎరగరు. విఘ్నేశ్వరుడు అలాగ ఎరుకపడి ఉంటే .విఘ్నేశ్వరుడే దేవుడని ఆరాధనమొదలపెట్టి, తమ స్వామినే విస్మరించుతారని విఘ్నేశ్వరుడు అజ్ఞాత బాలకుడిగానే ఉండిపోయాడన్న సంగతి స్వామి పదేపదే తలంచుకుని మనసారా విఘ్నేశ్వరుణ్ణి స్మరిస్తూండేవాడు. కైలాసానికి వెళ్ళి విఘ్నేశ్వరునితో, కుమారస్వామితో ఆనందం పంచుకోవాలని తరచూ ఉవ్విళ్ళూరేవాడు.

విఘ్నేశ్వరుడు శబరులను సంస్కరించి మూషిక వాహనుడై ఆకాశమార్గంలో క్రిందకు చూస్తూ ఉత్తరదిశగా తిరుగుప్రయాణం చేస్తున్నాడు. కొండచరియలన్నీ కీకారణ్యాలతో నిండి ఉన్నాయేగాని భూమి అంతా బీడుపడిన మైదానంలాగ కనిపించింది. జలసమృద్ధి ఉంటే కనులపండుగగా పైరు పచ్చగా ఉండవలసింది కాని, నీటి కొరత తీర్చే

నదులు లేక సౌభాగ్యశూన్యంగా భూములు వెలవెలపోతున్నవి, ప్రజలు ఆకాశాన్ని మబ్బుల్ని నమ్ముకొని ఏదో ఒకలాగ జీవయాత్ర సాగిస్తున్నారు.

''గంగమ్మలాంటి నది కలిగిన ఉత్తరదేశ ప్రజలు ఎంత పుణ్యం చేసి పుట్టారో! అంత గంగమనకు లేకపోయినా అందులో ఒకపాయ మనకు ఏ దేవుడైనా కనికరించి ఇవ్వకూడదా? ముక్కోటి దేవుళ్ళున్నారంటారు. ఎందుకూ? ఒక్కరికీ జాలిలేదు,'' అంటూ సామాన్య ప్రజలు తమలో తాము అక్కడక్కడ అనుకుంటున్న మాటలు వినిపిస్తూనే ఉన్నాయి విఘ్నేశ్వరుడి పెద్ద చెవులకు.

అటు పడమటి దిక్కున ఎత్తయిన పర్వత శ్రేణులు, ఇటు తూర్పున చిన్నచిన్న కొండల బారుతో నిండి ఉన్న భూభాగాలు విశాలంగా తూర్పు సముద్రం వరకూ ఊరికే వున్నాయి. ఎక్కువమంది జనులు జంతువుల్నీ, పక్షుల్నీ వేటాడి తింటూ ఆటవిక జీవనం సాగిస్తున్నారు. సేద్యం మీద ఆధారపడ్డవారు శాపగ్రస్తుల్లా పడరాని అగచాట్లు పడుతూనే ఉన్నారు. సముద్రంమీద ప్రాణభీతి విడిచి చేపలుపట్టే జాలరులు విశేషంగా కనిపించారు. చాలీచాలని మేతతో పశుగణాలు బక్కచిక్కి దీనంగా కనిపించాయి. తూర్పుతీరం పొడవునా ఎక్కడ జూసినా జాలరిపల్లెలే కనిపించాయిగాని మంచి ఊళ్ళు లేవు.

ఉత్తరభూమితో పోల్చి చూస్తే విఘ్నేశ్వరుడికి చాలావిచారం కలిగింది. హిమాచల సీమలో ఎటు చూసినా సుందర జలపాతాలతో, రమణీయ సరోవరాలతో, నదీ నదాలతో మనోహరంగా కనిపించే పచ్చని ప్రకృతి కళ కళలాడుతూ ఆనందదాయకంగా ఉంటుంది. ఇక్కడ పడమటి పర్వతాలు దిష్టిబొమ్మల్లాగ బోడిగా ఉన్నాయి.

ఆ పర్వతశ్రేణి నడుమ సహ్యాద్రి చేరువనున్న లోయలో గౌతముడి ఆశ్రమం మసిబొగ్గుల్లో మరకతంలాగ ఆకుపచ్చగా మిలమిలా మెరుస్తున్నది.

విఘ్నేశ్వరుడికి ఏదో ఆలోచన వచ్చినట్టుగా తల పంకించాడు. ఎలుకను వేగం పెంచమని హెచ్చరికగా తట్టి దక్షిణాదిని, వింధ్యను దాటి ఉత్తరాదిని చేరుకున్నాడు. ఉత్తరభూమి దూరానికి అంతా ఏదో కొత్తగా ఉన్నట్టు కనిపించింది. సమీపించేసరికి అక్కడ అంతా అయోమయంగా ఉంది.





# శివుడి తెలివి!

పూర్వం సిరిపల్లెలో కొమరయ్య అనే రైతు వుండేవాడు. అతడికి ఒకే ఒక మగబిడ్డమాత్రమే కలిగాడు. వాడు ఈడువాడయ్యాక దగ్గరబంధువుల అమ్మాయితో వివాహం జరిపించారు. ఒకటిన్నర సంవత్సరాలకాలం జరిగేసరికి, కోడలు చక్కటి మగబిడ్డను కన్నది. కొమరయ్య దంపతులు మనవణ్ణి చూసి పరమానందం చెందారు.

అయితే, మనవడు నెల రోజుల బిడ్డగా వుండగా, కొమరయ్య కొడుకూ, కోడలూ పల్లెకు దాపులనున్న ఏటికాలువను బల్ల కట్టుపైన దాటుతుండగా జరిగిన ప్రమాదంలో ఇద్దరూ కాలం చేయడం జరిగింది.

తమకు దాపురించిన దౌర్భాగ్యానికి నిద్రాహారాలుకూడా మానుకుని అదేపనిగా విలపిస్తున్న కొమరయ్య దంపతులు, ఇరుగూ పొరుగూ నూరిపోసిన ధైర్యవచనాలతో నెమ్మదిగా కోలుకున్నారు. వాళ్ళు మనవణ్ణి పల్లెలో వున్న నీలకంఠ దేవాలయానికి తీసుకుపోయి, అక్కడి పూజారి గంగాధర భట్టు మాట ప్రకారం, బిడ్డకు శివుడు అని పేరుపెట్టి, వాడు మృత్యుంజయుడిగా కలకాలం వర్ధిల్లాలని కోరుకుంటూ ఈశ్వరుడికి మొక్కులు మొక్కారు.

ఆ శివుడు ఇప్పుడు పెళ్ళీడు కుర్రవాడు. వాడి చక్కదనాన్ని గురించీ, తెలివితేటల గురించీ పల్లెలో అందరూ గొప్పగా చెప్పుకునేవారు. వృద్ధపూజారి గంగాధరభట్టుకు, వాడంటే ఎంతో మురిపెం. తాతతో కలిసి ఇంచుమించు ప్రతిరోజూ ఆలయానికి వచ్చే శివుడితో కాసేపైనా కబుర్లు చెప్పనిదే ఆయనకు నిద్రపట్టదు.

ఒకనాటి సంజెవేళ, యధాప్రకారం గుడికి వచ్చిన తాతా మనవలిద్దరూ, ఈశ్వర దర్శనం చేసుకుని, మంటపంలో విశ్రాంతిగా కూర్చుని వున్న గంగాధరభట్టు దగ్గరకు వెళ్ళారు.

లక్ష్మీగాయత్రి



భట్టు వారిని చూసి చిరునవ్వుతో కూర్చో వలసిందిగా సైగచేస్తూ, శివుడితో, "ఏం శివా! మీ తాత ముఖం ఈరోజు కాస్త చిటపటలాడు తున్నట్టున్నది! ఏమిటి సంగతి?" అంటూ ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు శివుడు చిన్నగా నవ్వుతూ, "తాతకు నా మీద బాగా కోపంగా వున్నది, స్వామీ!" అంటూ జవాబిచ్చాడు.

"ఏమిటీ, మీ తాతకు నీమీద కోపమా!" అని భట్టు ఆశ్చర్యపోతూంటే, కొమరయ్య కల్పించుకుని, "కోపమో, బాధో మీరే విని చెప్పండి, బాబూ! పెళ్ళిచేసుకోరా నాయనా అంటే వీడు వినడు. ఆఖరికి ఇవాళ గట్టిగా నిలదీస్తే, ఏదేదో చెబుతున్నాడు. అదంతా వాడినోటివెంట మీరేవిని న్యాయం చెప్పండి," అన్నాడు.

భట్టు, శివుడికేసి చూశాడు. శివుడు కాస్త తలదించుకుని, "మరేమీ లేదు స్వామీ! ఉన్నఫళంగా ఎవతెనో చూపించి పెళ్ళాడెయ్య మనటం ఏంబాగు! పిల్లకాస్త కనుముక్కుతీరు బాగున్నదైతే, పనిపాట్లు రానిదై వుంటుంది. అందమూ, తెలివీ, పనితనమూ ఉన్న పొగరు బోతుపిల్ల దొరికిందంటే, తాతా నానమ్మా ఈ వయసులో ఏం సుఖపడతారు. నేనిలా అనే సరికి తాతకు కోపం వచ్చింది," అన్నాడు.

శివుడి మాటలకు భట్టు ముచ్చటపడి నవ్వుతూ, "కొమరయ్యా, మీవాడు చాలా పెద్ద ఎత్తునే వున్నాడయ్యా," అన్నాడు.

ఇందుకు కొమరయ్య ఏదో చెప్పబో తూండగా, అతడి సాటిరైతు చంద్రయ్య అక్కడికి వచ్చాడు. చంద్రయ్య వెనకే ఒక చక్కని పెళ్ళీడుపిల్ల వున్నది. చంద్రయ్య, భట్టుకు నమస్కరించి, తాను తెచ్చిన పనస పండు ఆయన దగ్గరపెట్టాడు.

భట్టు సాదరంగా చంద్రయ్యనుపలకరించి, "పండు బాగున్నదయ్యా! ఇంతకూ నీ వెనక ఆ పిల్ల ఎవరు?" అంటూ ప్రశ్నించాడు.

"మా తోడల్లుడి కూతురు గౌరి బాబూ! కృష్ణపట్నం నుంచి వచ్చింది. పేరుకు పట్నం పిల్లేగాని దీనికి రాని పనంటూ లేదనుకోండి. మా ఆవిడ గంటలో చేసే పని ఇది తెలివిగా చిటికెలో చేసేస్తుంది," అన్నాడు చంద్రయ్య.

అంతలో గౌరి రెండడుగులు ముందుకు వేసి, వంగి భట్టుకు నమస్కరించింది.

"శీఘ్రమేవ కళ్యాణమస్తు," అంటూ గౌరిని ఆశీర్వదించిన భట్టు, శివుడి ముఖంలో గౌరిపట్ల వ్యక్తమవుతున్న ప్రశంసను గమ నించి, ఒక నిశ్చయానికి వచ్చాడు.

తర్వాత ఆయన చంద్రయ్యతో, "చంద్రయ్యా, నువ్వు చెబుతున్నదాన్నిబట్టి ఈ పిల్ల మంచి చురుకైనదీ, తెలివైనదీ అని తెలుస్తున్నది. ఇదుగో, ఈ శివుడి తెలివీ, బుద్ధీ మనం ఎరిగినవే. ఇప్పుడు వీళ్ళిద్దరిలో ఎవరు ఎక్కువ గడుగ్గాయో చూద్దామని, నాకు మహా కుతూహలంగా వున్నది. ఆ పిల్లకేమీ అభ్యంతరం లేదుకదా, కాస్త కనుక్కో!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

చంద్రయ్య ఏమంటావన్నట్టు తనవైపు చూడగానే గౌరి, అభ్యంతరం ఏమీ లేదన్నట్టు తలాడించింది.

అది చూడగానే భట్టు, శివుడితో, "ఏది రాబాబూ, మా పిల్లను నీకు తోచినదేదైనా అడుగు చూద్దాం!" అన్నాడు.

వెంటనే శివుడు ఉత్సాహంగా ముందుకొక అడుగువేసి, సన్నగా నాజూకుగావున్న గౌరి వైపు చూస్తూ, "మీ ఇంటి ద్వారాలన్నీ చిన్నవేనా లేక పెద్దవీ వున్నాయా?" అంటూ ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు గంగాధరభట్టు ముఖంలో నవ్వు కదలాడగా, కొమరయ్య, చంద్రయ్య ఇదేం ప్రశ్న అన్నట్టు చూశారు.

గౌరిమాత్రం తల కాస్త పైకెత్తి, పుష్టిగా కండతేలిన శివుడి శరీరాన్ని ఓరకంట చూస్తూ, "మాది వ్యవసాయ కుటుంబం. కష్టించి పని చేసే రైతుకుటుంబాల ఇళ్ళ ద్వారాలన్నీ సామాన్యంగా చిన్నవిగానే వుంటాయిగదా! మావి మీ ఇళ్ళకంటే కూడా కాస్త చిన్నవే," అని జవాబిచ్చింది.

చిన్నప్పటి నుంచి తాత గారాబంవల్ల, భోజనప్రియుడుగా, తిండిపుష్టితో పెరిగిన



శివుడు, గౌరి జవాబు విని కాస్త మొహం ముడుచుకుని, అయినా తన శరీరం మరీ ద్వారం పట్టనంతగా లేదుగదా అని తృప్తి పడుతూ, "సరేలేగానీ, నిండు నీటికడవ ఉదయానే నీకిస్తే, సాయంత్రానికి అది ఖాళీ అయిపోతుందా లేక నిండుగానేఉంటుందా?" అంటూ రెండవ ప్రశ్న వేశాడు.

దానికి గౌరి, "నీరు వృథా చెయ్యకుండా అవసరం అయిన మేరకే వాడతాను గనక, సాయంత్రానికి సగం కడవ మాత్రమే ఖాళీ అవుతుంది!" అన్నది.

ఆమె పిసినారిగానీ, దుబారాఖర్చు చేసే మనిషిగానీ కాదని, పొదుపు విలువ తెలిసినదే నని గ్రహించిన శివుడు ఆనందిస్తూ, "సరే, ఎందుకూ పనికిరాని ముసలి ఎద్దుల్ని ఏం చేయాలంటావు?" అని అడిగాడు.

"ప్రతి ప్రాణీ ఎప్పుడో ఒకప్పుడు ముసలి దయ్యేదే! అంచేత, అవి వయసులో ఉన్నప్పుడు మనకు చేసిన సేవల్ని గుర్తుంచుకుని, వాటిని జాగ్రత్తగా సాకాలి," అన్నది గౌరి.

ఆ జవాబు విన్న శివుడికి, తాను ఆ పిల్లను పెళ్ళిచేసుకుంటే, ఆమె తన తాతనూ, నానమ్మనూ జాగ్రత్తగానే చూసుకుంటుందన్న నమ్మకం కలిగింది. అయినప్పటికీ అంతటితో సరిపెట్టక శివుడు, "సరే, బాగుందిగాని, ఒకటికి ఒకటి కలపాలంటావా, అంతకంటే ఎక్కువ కలపాలా లేక అసలేమీ కలపక్కర్లేదా?" అంటూ ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు గౌరి చిరుకోపంగా, "ఒకటి పెద్దదైతే అసలేమీ కలపక్కర్లేదు. దేవుడిదైతే మాత్రం ఒకటికి పది కలిపినా కలపవచ్చు, చెప్పలేం!" అన్నది.

అప్పటిదాకా మౌనంగా వారి సంభాషణను ఆలకిస్తున్న గంగాధరభట్టు, ఆ జవాబు వింటూనే పెద్దగా నవ్వేశాడు. శివుడు మాత్రం ఆ జవాబు విని మొహం గంటు పెట్టుకుని కూర్చున్నాడు. సంగతేమిటో ఏమీ అర్థంకాని కొమరయ్య, చంద్రయ్య మాత్రం అయోమయంగా భట్టు వైపు చూశారు.

గంగాధరభట్టు నవ్వుతూ వారివైపు చూసి, "శివుడి చివరి ప్రశ్నా, గౌరి జవాబూ తప్ప, మిగిలిన అన్ని ప్రశ్నలూ, జవాబులూ అర్థమయినైగదా! సరే, ఈ చివరి ప్రశ్న, జవాబు: ఎవరైనా ఒక మాట అంటే ఊరుకుంటావా లేక తిరిగి మాటలంటావా? అని ప్రశ్నించాడు శివుడు. దానికి గౌరి కాస్త చిర్రెత్తింది కాబోలు, శివుడికి చిన్న చురక అంటిస్తూ–కుటుంబంలో పెద్దలు ఒకమాట అంటే, వారిపట్ల గౌరవంకొద్దీ మౌనం వహించాలనీ, మాటన్నది మొగుడైతే మాత్రం ఒకటికి పది అంటించినా అంటించవచ్చుననీ జవాబు చెప్పి, ఆలుమగల కలహాలు సృష్టిలో సాధారణమైనవన్న విషయాన్ని రుజువుచేసింది. వీళ్ళిద్దరూ అందచందాలలో, తెలివితేటలలో ఒకరికొకరు తగినవారనటంలో, ఇక ఏ సందేహమూ లేదు. శుభమస్తు! శీఘ్రమేవ వివాహప్రాప్తిరస్తు!" అంటూ శివుణ్ణీ, గౌరిని ఆశీర్వదించాడు.

భట్టు మాటలకు శివుడు, గౌరి ఆనందంగా ఒకరినొకరు చూసుకుని, ఇద్దరూ కలిసి వినయంగా గంగాధరభట్టు పాదాలకు నమస్కరించారు.





# ఇంటి దొంగ

మధ్యాహ్నపు ఎండవేళ కమల భర్త మాధవుడు, హడావిడిగా భోజనం చేసి, ఏదో అవసరం అయిన పని పడిందంటూ బయటికి వెళ్ళాడు. కమల వంటగది సర్ది, పక్కనే వున్న పడకగదిలో చిన్న కునుకు తీస్తుండగా, సమీపంలో ఏదో అలికిడి విని కళ్ళు తెరిచి చూసి నివ్వెరపోయింది. మంచానికి కుడివైపు వారగావున్న బల్లదగ్గర కమల అడపడుచు భర్త విశ్వం నిలబడి, బల్లమీది ఆమె పెట్టెను నిశ్శబ్దంగా తెరుస్తున్నాడు.

కమల నోట మాటరాక, అరమూత కళ్ళతో గమనిస్తుండగానే, విశ్వం పెట్టె మూత సాంతం తెరిచి, పట్టుచీరల కింద భద్రపరచిన ఆమె పది తులాల బంగారు హారాన్ని తీసి జేబులో వేసుకుని, పెట్టె మూసేసి నెమ్మదిగా బయటికి వెళ్ళిపోయాడు. జరిగిన సంఘటనకు విభ్రాంతి చెందిన కమల, కొంతసేపటిదాకా కదలా మెదలక ఆలోచిస్తూ వుండిపోయింది.

కమల భర్త మాధవుడికి, లక్ష్మి అనే అక్క తప్ప ఇంకెవరూ తోబుట్టువులు లేరు. లక్ష్మి భర్త విశ్వం కచేరిలో చిన్న ఉద్యోగి. స్వతహాగా మంచివాడూ, నెమ్మదస్థుడూ అయిన విశ్వానికి సహనం కూడా ఎక్కువే!

విశ్వాన్ని గురించి దీర్ఘంగా ఆలోచిస్తున్న కమల, "విశ్వమన్నయ్య మంచివాడే! అతడిలో ఎలాంటి దుర్బుద్ధీ లేశమాత్రం కూడా కనిపించదు. అటువంటివాడు ఇంతటి సైచ్యానికి ఒడిగట్టాడంటే, ఇది తప్పనిసరిగా పట్టించుకోవలసిన విషయమే!" అనుకున్నది.

సాయంత్రందాకా గుట్టుగా కాలక్షేపం చేసిన కమల, సాయంత్రం భర్త ఇల్లు చేరిన కాసేపటికి, ఏదో నెపం మీద పెట్టె తెరిచి, హారంలేని సంగతి అప్పుడే గ్రహించినదానిలా గాభరాగా కేకలు పెట్టింది.

కమల కేకలు విని ఇంటిల్లిపాదీ అక్కడ చేరి, కంగారుగా తలా ఒకచోట వెతకడం

లలిత–శర్మిల



ప్రారంభించారు. కమల కూడా కంగారు నటిస్తూ, కాసేపు వెతుకులాట సాగించి, చివరకు, ''ఇలా దిక్కుతోచని సమస్య ఏది వచ్చినా, దేవుడి మీద పూర్తి భారం వెయ్యడం నాకు మొదటినుంచీ అలవాటు!'' అంటూ దేవుడి మందిరం దగ్గరకు వెళ్ళి, కళ్ళు మూసుకుని చేతులు జోడించి ఏదో ప్రార్థించింది.

ఇది జరిగిన పదవనాటి ఉదయాన్నే ఎవరో ఇంటి తలుపు తట్టారు. తలుపు తీసిన కమల భర్త మాధవుడికి గుమ్మంలో ఒక వృద్ధ సాధువు కనిపించి, ''నన్ను లోపలికి రానిస్తావా, లేక చెప్పదలచుకున్నదేదో ఇక్కడి నుంచే చెప్పేసి పొమ్మంటావా? ఏం, మాధవా?'' అంటూ ప్రశ్నించాడు.

సాధువుకు, ఏం జవాబివ్వడమా అని ఆలోచిస్తున్నంతలో, అక్కడే వున్న విశ్వం చప్పున ముందుకు వచ్చి సాధువుకు నమస్కరిస్తూ లోపలికి ఆహ్వానించాడు.

సాధువు, విశ్వాన్ని ఒక్కక్షణం తీక్షణంగా తేరిపారజూసి లోపలికి వచ్చి, ఆసరికి అక్కడికి వచ్చిన కమలను చిరునవ్వుతో పలకరిస్తూ ఆశీర్వదించి, ''అమ్మా కమలా! భగవత్ప్రేరణే నన్నీరోజున నీ వాకిటికి లాక్కొచ్చింది. నీకు నీ పుట్టింటివారు పెట్టిన ఖరీదైన నగ మాయమైందిగదూ?'' అని ప్రశ్నించాడు.

కమల అవునంటూ తలాడించగానే, ''పోయిన నీ నగ, ఒకటి రెండు రోజుల్లో తిరిగి నీ పెట్టెలో చేరుతుంది. నేను మళ్ళీ ఎల్లుండి ఉదయానే వస్తాను. నేనిక్కడ నిర్వర్తించవలసిన ముఖ్యకార్యం మరొకటున్నది!'' అని చెప్పి, విశ్వం వైపు తిరిగి, ''నువ్వు నాతో కలిసి నాలుగడుగులు నడవగలవా?'' అన్నాడు.

ఆసరికే సాధువు మాటలతో ముడుచుకుపోయి వున్న విశ్వం, మరింత కుంచించుకుపోతూ సాధువును అనుసరించాడు. వెళ్ళిన అరగంటకు తిరిగి వచ్చిన విశ్వం ముఖంలో గత రెండు రోజులుగా కనిపిస్తున్న బాధ, ఆందోళన లేకపోగా, ఒక విధమైన ప్రశాంతత, వుండటం గమనించింది కమల.

ఆనాటి సాయంత్రమే చీరకోసం పెట్టె తెరిచిన కమల ఆనందంగా, ''నా నగ దొరికింది,'' అంటూ కేకపెట్టింది.

ఆమె కేకకు నలుగురూ చేరి, హారాన్ని చూసి చాలా సంతోషించారు. మూడోనాటి ఉదయం వచ్చిన సాధువుకు, ఆ ఇంట ఘన స్వాగతం లభించింది. ఆయన తీరిగ్గా చాప మీద పద్మాసనం వేసుకు కూర్చుని, అక్కడ చేరినవారందరినీ ఉద్దేశించి, ''కుటుంబం

సుఖసౌఖ్యాలకూ, మంచి చెడ్డలకూ మూల కారణం, ఆ ఇంటి ఇల్లాలి ప్రవర్తనే అన్న విష యంబాగా గుర్తుంచుకోదగింది. ఇల్లాలి తృప్తి లక్ష్మీదేవినీ, అసంతృప్తి ఇనపగజ్జెల తల్లినీ నట్టింట కొలువుదీరుస్తాయి. కనుక, ప్రతి ఒక్కరూ వివేకంగా బతకటం నేర్చు కోవాలి!" అని, ఎవరికీ ఒక్క మాట మాట్లా డేందుక్కూడా అవకాశం ఇవ్వకుండా లేచి వెళ్ళిపోయాడు.

ఆనాటి రాత్రి మాధవుడు, కమలతో మాట్లాడుతూ, "ఆ సాధువులో ఏదో దైవాంశ వున్నదని, నా నమ్మకం!" అంటూ సాధువును తలచుకుని చేతులు జోడించాడు.

కమల చిన్నగా నవ్వి, "పెళ్ళయిన దగ్గ ర్నించీ వదిన అసంతృప్తి గమనిస్తూనే వున్నాను. ఆ అసంతృప్తే విశ్వమన్నయ్య మంచితనాన్ని మాయంచేసి, అతడిచేత దొంగతనం చేయించే హీనస్థితికి దిగజార్చింది. ఆ సాధువు మరెవరో కాదు, మామేనమామ కాశీవిశ్వనాధం.ఆయన సహాయంతో ఈ పథకం వేశాను," అంటూ ఇంకా చెప్పబోతూండగా మాధవుడు ఆశ్చ ర్యంగా, "ఔరా! మీ మేనమామను వాళ్ళ గ్రామం వెళ్ళినప్పుడు ఎన్నోసార్లు చూశాను. అయినా, సాధువేషంలో ఏమాత్రం అనుమా నించలేకపోయాను," అన్నాడు.

"ఆయనపురాణ నాటకాల్లో, ఈ వయసు లోనూ ఏదో ఒక వేషం వేస్తూనే వుంటాడు, సరే! మామయ్య, విశ్వమన్నయ్యను బైటికి తీసుకుపోయి ఏం చేశాడో తెలుసా? 'నువ్వే దొంగవని నాకు తెలుసు, నాయనా! ఇటు వంటి అమర్యాదకరమైన పని ఎందుకు చేశావు?' అని అడిగాడు. దానికి విశ్వమన్నయ్య ఏడ్చినంతపనిచేసి, వదిన సాధింపులూ వేధిం పులూ భరించలేక, ఆమె ప్రోత్సాహంతో ఈ దొంగతనం చేశానని చెప్పి, ఇకనుంచి ఆమెను తగిన కట్టడిలో వుంచుతానని, ఒట్టుపెట్టు కున్నాడట. ఆతర్వాత అన్నయ్యద్వారా హారం తిరిగి, నా పెట్టెలో చేరింది," అని చెప్పింది.

అంతా విన్న మాధవుడు, "పదిమందిలో బావకు దొంగ అన్న అపవాదు పడకుండా, ఇంటి దొంగను పట్టి, పోయిన హారాన్ని తిరిగి సంపాయించేందుకు చాలా తెలివైన పథకం వేశావు. మెట్టినింటి పరువు మర్యాదలకు అత్యంత విలువనిచ్చే ఇల్లాలే నిజమైన బంగారు హారమని, ఆ సాధుపుంగవుడు ఖచ్చితంగా చెబుతాడు!" అన్నాడు నవ్వుతూ.





# విద్వారాలు

ఒక రాజు ప్రతి ఏడూ ఒక ప్రత్యేక సభ చేసి, దానికి బుద్ధికుశలతగల యువకులను ఆహ్వానించేవాడు. వారిని, రకరకాల ప్రశ్నలడిగి సమాధానాలు విని ఆనందించేవాడు. తెలివైన సమాధానాలు చెప్పినవారిని తగినవిధంగా సత్కరించేవాడు. అర్హులకు ఉద్యోగాలిచ్చేవాడు. ఒకసారి ఈ సభలో గణపతి అనే యువకుడు అందరికన్న ఎక్కువ చాకచక్యం చూపాడు.

''చేతులున్న మొండివాణ్ణి మీలో ఎవరైనా చూశారా?'' అని ప్రధానమంత్రి మాటల సందర్భంలో అన్నాడు.

దానికి గణపతి, ''నేను ఇక్కడికి వస్తూండగా దారిలో ఒక బిచ్చగాడు కలమూ, కాగితమూ దగ్గర పెట్టుకుని, అందరినీ అడిగినట్టే నన్ను కూడా 'అయ్యా, ధర్మం!' అని అడిగాడు. నేను నాకు తోచినది వాడికి ఇచ్చాను. వాడు వెంటనే కాగితం మీద 'రెండు' అని రాసుకున్నాడు. 'ఏమిటి రాస్తున్నావు?' అని నేను వాణ్ణి అడిగాను. 'మరేమీ లేదు. చేతులుండి మొండివాళ్ళు కానివాళ్ళ లెక్క వేస్తున్నాను. మీరు రెండోవారు,' అన్నాడు బిచ్చగాడు. అంటే పేదలకు దానధర్మాలు చెయ్యనివాళ్ళు చేతులుండి కూడా మొండివాళ్ళేనని వాడి ఉద్దేశం,'' అన్నాడు.

''అలాగే, కళ్ళుండి గుడ్డివాళ్ళు కూడా కావచ్చుగా?'' అన్నాడు మంత్రి.

దానికి సమాధానంగా గణపతి ఇలా చెప్పాడు:

''చిత్తం! ఒకసారి నేను ఒక నగరానికి వెళ్ళాను. అక్కడ ఒక ఇంటికి తాళంపెట్టి ఉన్నది; కానీ లోపల ఏదో అలికిడి అవుతున్నది. 'ఎవరు లోపల?' అని కేకపెట్టాను. సమాధానం రాలేదు. నేను వెంటనే ఇరుగుపొరుగువాళ్ళను చేర్చాను. పారిపోవటానికి సిద్ధంగా ఉన్న దొంగను వాళ్ళు పట్టుకున్నారు. ఆ దొంగ నన్ను చూసి, 'నీలాగ కళ్ళుండి గుడ్డివాళ్ళు కానివాళ్ళు

చాలా అరుదు. అందుకే నా వృత్తి ఇంతకాలం చక్కగా సాగింది,' అన్నాడు. వాడి లెక్కన ఇల్లు తాళంపెట్టి ఉండటం చూసికూడా లోపల అలికిడిని పట్టించుకోని వారంతా కళ్ళుండి గుడ్డివాళ్ళే అనుకోవాలి.''

వాడి మాటలకు సంతోషించి తలాడించి, ''అలా అయితే నాలుక ఉండి కూడా మూగ వాళ్ళు ఎవరంటావు?'' అని మంత్రి మళ్ళీ అడిగాడు.

దానికి గణపతి, ''నేను ఒకసారి మా వూళ్ళో ఒక ధనికుడివద్ద చిన్న మొత్తం అప్పు చెయ్యవలసి వచ్చింది. వడ్డీ ప్రస్తావన వచ్చి ఆయన నాతో, 'నాలుక ఉండి కూడా మూగ వాళ్ళయినవారికి రూపాయికి నెలకు పావలా వడ్డీ. అలా కానివారికి వడ్డీలేదు, అంటే ఏమి టని అడిగాను. అప్పు తీసుకుని ఇస్తామన్న గడువుకు ఇయ్యక, అదుకుగాను ఏవో అబ ద్ధాలు చెప్పేవాళ్ళూ, అబద్ధాలు కారణంగా చెప్పి అప్పు అడిగేవాళ్ళూ నాలుక ఉండికూడా మూగ వాళ్ళేనని ఆయన అన్నాడు,'' అన్నాడు.

''చెప్పకుండా పోయేది, చెప్పకుండా వచ్చేది చావుగాక మరేదైనా ఉన్నదా?'' అని మంత్రి అందరినీ అడిగాడు. దానికి ఎవరూ సమాధానం చెప్పకపోయేసరికి గణపతే ఇలా అన్నాడు:

''యౌవనం చెప్పకుండా వెళ్ళిపోతుంది గనక జాగ్రత్తగా ఉండాలనీ, చెప్పకుండా వచ్చే అదృష్టాన్ని నమ్ముకుని భ్రష్టుకారాదనీ మా తాత తరుచూ అనేవాడు.''

''అనేకసార్లు చచ్చేవాళ్ళు ఉంటారా?'' అని మంత్రి అడిగాడు. దానికి కూడా గణపతే సమాధానం చెప్పాడు:

'నేను ఈ నగరంలో ప్రవేశించి, ఒక ఇంటి అరుగు మీద ఏడుస్తూ కూర్చుని ఉన్న ఒక మనిషిని చూసి, 'ఎందుకమ్మా, ఏడుస్తు న్నావు?' అని అడిగాను. దానికామె, 'ఏడవక ఏం చేసేది, నాయనా? నా భర్త రోజూ చస్తు న్నాడు. నా జీవితమంతా ఏడుపుగానే ఉంది. వీరుడైన నా కొడుకు రెండేళ్ళ క్రితం ఒకేసారి చచ్చాడు. నా భర్త పిరికివాడు, రోజుకు పది సార్లు చస్తాడు,' అన్నది.

గణపతిని కొలువులో చేర్చుకోవచ్చునని ప్రధానమంత్రి రాజుకు సలహా ఇచ్చాడు. గణపతికి ఉద్యోగం దొరికింది.



ఇదొక చందమామ కానుక!

# అజేయుడు గరుడుడు!

19

చిత్రాలు: పాణి.

సేనాధిపతి నరేంద్రదేవుడు గుహాలయంలోని తాంత్రికవేత్త నాగబంధు సలహాలు పాటించడానికి సంసిద్ధుడయ్యాడు. ఆయన సలహామేరకు, భూతవైద్యుడు చాందినీ నదీతీరానికి వెళ్ళి, రవీంద్రదేవుణ్ణి కలుసుకుని, భద్రత దృష్ట్యా అతన్ని గుహాలయానికి వెంటబెట్టుకుని వచ్చాడు. అక్కడ చంద్రపురిలో ఆదిత్యుడు తన అనుచరులతో కలిసి రాజభవనాన్ని చుట్టుముట్టి వశపరుచుకున్నాడు.

ఆదిత్యుడు తన అనుచరులతో కోటలోకి ప్రవేశించాడు.

మొదట రవీంద్రదేవుడు బంధించిన విశ్వాసపాత్రులైన భవన రక్షకులను విడుదల చేయండి. వెంటనే వాళ్ళు భవన రక్షణ బాధ్యతలను చేపట్టాలి.

ఆదిత్యుడు భవనంలోని తన నివాస గృహానికి వెళ్ళాడు. గరుడవిగ్రహం ముందు భక్తితో కూర్చుని కొంతసేపు ధ్యాననిమగ్నుడయ్యాడు.

అప్పుడు... గుహాలయంలో నరేంద్రదేవుడు, రవీంద్రదేవుల సమక్షంలో తాంత్రికవేత్త ఏవో మంత్ర తంత్రాలు చేస్తున్న దృశ్యాలు ఆయన మనోనేత్రాలకు కనిపించాయి.


రాజభవనం వెలుపల ఉన్నట్టుండి మేళ తాళాలు, బూరలు ఊదే శబ్దం రావడంతో ఆదిత్యుడి ధ్యానానికి అంతరాయం కలిగింది. ఆయన మెల్లగా కళ్ళు తెరచి, రాజుగారు వచ్చారని గ్రహించాడు.
ఆదిత్యుడు లేచి గబగబా రాజభవన ద్వారం దగ్గరికి వెళ్ళాడు.
రథం నా వెనక వస్తోంది ప్రభూ!
అరుణా, నువ్వు ముందు వెళ్ళు!


రాజును చూడడానికీ, ఆయన మాటలు వినడానికీ అసంఖ్యాకంగా ప్రజలు గుమిగూడారు.
నరేంద్రదేవుణ్ణీ, రవీంద్రదేవుణ్ణీ రాజద్రోహులుగా ప్రకటిస్తున్నాను. ఆ దుర్మార్గులు చంద్రపురి నుంచి తప్పించుకుని పారిపోయారు. వాళ్ళను ఎలాగైనా పట్టుకోవాలి.
అక్కడ... తాంత్రికుడి గుహలో భూతవైద్యుడు రవీంద్రదేవుడికి ధైర్యం చెబుతున్నాడు.
భయపడకండి, ఇక్కడ ఉన్నంతవరకూ మీమీద ఈగ కూడా వాలదు.


పైపెచ్చు, రాజఋషి పాషాంకర శక్తిని ఉచ్చాటనం చేయడానికి ప్రత్యేక యజ్ఞం చేస్తున్నారు.
దాంతో, ఆదిత్యుడు ఆయన అదుపాజ్ఞలలోకి వచ్చి వశమౌతాడు.
తాంత్రికుడు మంత్ర తంత్రాలు చేస్తున్న అగ్నికుండం పొగలోనుంచి వింతరూపంతో వెలువడిన ఒక జంతువు విచిత్ర శబ్దం చేయడంతో భూతవైద్యుడి దృష్టి అటుకేసి మళ్ళింది.


సోదరా పాషాంకరా! మన శత్రువు ఆశీస్సులు పొందిన మొలకను ఇప్పుడే తుంచి వేయాలి. మనం మన ప్రభువుకు చేయవలసిన ప్రధాన బాధ్యత ఇది.
వాడు చంద్రపురిలో ఉంటున్నాడు. వచ్చే పౌర్ణమి లోపల వాణ్ణి నా సమక్షానికి తీసుకురా. అప్పుడే నేను నా యజ్ఞాన్ని జయప్రదంగా పరిసమాప్తి చేయగలను...


వాడికి మనోభ్రాంతి కలిగించి వశపరుచుకో! ఆ ఈక నిన్ను నాశపరచక ముందే నువ్వు దాన్ని నామరూపాలు లేకుండా చేయాలి!
చిత్తం గురుదేవా! అయితే వాడి ఆధీనంలో ఉన్న గరుడుడి ఈక మొదట నా చేతికి రావాలి!
ఆ యువకుణ్ణే హతమారుస్తాను!


దంబాలు పలికే రవీంద్రదేవుడు మౌనంగా ఊరుకో లేకపోయాడు.
ఆ అల్ప మానవుడి కోసం నీ అద్భుత శక్తులనెందుకు వృధా చేసుకుంటావు? నన్ను ఆజ్ఞాపించు. ఈ క్షణమే ఆదిత్యుణ్ణి తెచ్చి నీ ముందుంచుతాను!
వాడి దంబాలు తాంత్రికుడికి వెగటు పుట్టించాయి. అతడు నరేంద్రదేవుడికేసి తిరిగాడు.
పాషాంకరుడుతన మాయాశక్తిని ఆదిత్యుడి మీద ప్రయోగించిన వెంటనే రాజభవనం మీదికి వెళ్లడానికి, విశ్వాసపాత్రులైన నీ అనుచరులందరినీ సమీకరించు!

గుహలోపలికి వెళ్ళే ముందు తాంత్రికుడు భూత వైద్యుడితో మాట్లాడాడు.

దంబాలు పలుకుతూ అపాయాన్ని కోరి తెచ్చుకోవద్దని రవీంద్రదేవుణ్ణి హెచ్చరించు!

అక్కడ చంద్రపురిలో....

ఆదిత్యా! మన తదుపరి కర్తవ్యం ఏమిటి?

ఆదిత్యుడు తన అనుచరులకు సూచనలిచ్చాడు.

మనం ఆ రాజద్రోహులిద్దరినీ పట్టుకోవాలి. వాళ్ళిప్పుడు సర్పదేశ గుహల్లో అక్కడి కోయదొర రక్షణలో దాక్కుని ఉన్నారు.

రాజు అమితాశ్చర్యం చెందాడు.

ఏమిటీ సర్పదేశమా? అక్కడే పరమకర్కోటకుడైన తాంత్రికుడు కోయదొరలను వశపరచుకొని ఉన్నాడు.

అది చాలా ప్రమాదకరమైన కార్యం!

అంతకన్నా ప్రమాదం కాదా దుర్మార్గాన్ని అనుమతించడం. మహారాజా! తమ ఆశీస్సులతో....

తాంత్రికుణ్ణి నోరుమూయించి, నరేంద్ర, రవీంద్రదేవులు మళ్ళీ అక్కణ్ణించి తప్పించుకుని పారిపోకుండా అడ్డుకోగలం!. నా అనుచరులు అందుకు సర్వసమర్థులు!

ఇంకావుంది

# వినోద సమయం

## తాబేలుకు దారి చూపండి!

తాబేలు ధీరూకి ఐస్‌క్రీమ్ అంటే మహాఇష్టం. ఐస్‌క్రీమ్ కప్పును చూడగానే ఆనందంతో నాట్యం చేస్తోంది. అయితే, ఈ చిక్కుదారిగుండా అక్కడికి ఎలా చేరుకోవాలో దానికి తెలియడం లేదు పాపం. మీరు కాస్త దారిచూపి అది ఐస్‌క్రీమ్ తినేలా సాయపడగలరేమో చూడండి మరి.







## తేడాలు కనుగొనండి!



చూడడానికి రెండు చిత్రాలూ ఒకేవిధంగా ఉన్నాయి. అయితే ఈ రెండు చిత్రాల మధ్య ఎనిమిది తేడాలు ఉన్నాయి. మీ పరిశీలనా శక్తికి ఇదో ఆసక్తికరమైన పరీక్ష. కనుగొనండి మరి!



## కనిపించని చేపలు

శీనుకి చేపలు పట్టడం అంటే చెప్పలేనంత సరదా. చకచకా చాలా చేపలు పట్టేశాడు. అయితే, అవి ఎక్కడెక్కడికో ఎగిరిపోయాయి. మీరు జాగ్రత్తగా పరిశీలించి చూసి మొత్తం ఎన్ని చేపలు ఉన్నాయో లెక్కగట్టండి చూద్దాం!




## బాణం నీడ

కుందేలు రోనూ వేసిన బాణం రివ్వున దూసుకుపోతోంది. దానికి కింద కనిపిస్తున్న వాటిల్లో ఏది ఆ బాణం నీడో చెప్పగలరా?

(సమాధానాలు 70 పేజీ)



వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు నవంబర్ 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

జూలై 2002 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:

అద్దంకి శ్రీరామచంద్రమూర్తి
సీనియర్ ఇంజనీరింగ్ అసిస్టెంట్
దూరదర్శన్
హైదరాబాద్-500 013.



మొదటి ఫోటో: ముచ్చటైన నీ కోసం!
రెండవ ఫోటో: బహుచక్కనైన ఈ వేషం!!

### వినోద సమయం సమాధానాలు

**తేడాలు కనుగొనండి!**

1. సింహం జూలు
2. ఈగ రెక్కలు
3. పురుగు ఆకారం
4. ఏనుగు కనుబొమ్మ
5. తోడేలు తోక
6. పూలకుండీ
7. పూల సంఖ్య
8. గొంగళిపురుగు

**బాణం నీడ**

మూడవ నీడ

**ఎగిరిపోయిన చేపలు**

17

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

Chandamama CD-ROMs, are also available at all leading bookstores in




Its hours of non-stop fun!

Create your own Posters

Learn to Draw

Click to Paint

Drag and Drop to Dress Up your family

RS. 199/-

>DIRECT MAIL OFFER FOR CHANDAMAMA READERS<

**To avail 20% discount on Chandamama CD-ROMs, please write to the Project Head Multimedia with your :**

Name & Mailing address ..........................

Fun Workshop ☐ Copies

Early Reader Series
Jataka Tales Level 1 ☐ Copies
Total Copies : ☐ x 199

Please add delivery charges : By Regd. Post Rs. 41/- per CD and Rs.25/- for out-station cheques.

Enclose your order with a Cheque / DD, drawn in favour of Chandamama India Limited, payable at Chennai.

**** Offer available only for Indian residents.***

# CHANDAMAMA'

## EARLY READER SERIES
## Level-1

## ( FIRST 100 HOURS OF LANGUAGE LEARNING )




RS.







**JATAKA TALES - Early Reader Series (Level 1) children to instantly recognise 100 sight words English. It promises clean fun, good learning a superior pedagogical approach.**

**It is the first of a 3-series pack.**

**These CD-ROMs can also be used for any ESL as Second Language) course or Adult educatio programs that teach English.**

*Across media, a common tradition!*



*For trade and commercial enquirie*

*Project Head, Multimedia*
**CHANDAMAMA INDIA LIMITE**
No. 82, Defence Officers Colony,
Ekkatuthangal, Chennai - 600 097
Ph : 91-44-2347384, 91-44-23473
*Visit us at http://www.chandamam*

